నవంబరు
1948

# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

వెల
0—6—0



CHANDAMAMA — CHILDREN'S STORY MONTHLY



పూర్ణా రిలీస్

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక చిక్కుచదరాలు, ముగ్గులు, చిక్కుబొమ్మలు, పాటలు, పజిలు ఇంకా ఇంకా ఎన్నో వున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

త్వరలో వచ్చుచున్నది!




లక్ష్మీరాజ్యం (జూనియర్), కనకం, జి. వరలక్ష్మి, సూర్యశ్రీ, బాలామణి, ఏ. వి. సుబ్బారావు, రేలంగి

*Distributors for Andhra, Ceded and Nizams:*

**CHAMRIA TALKIE DISTRIBUTORS**

BEZWADA — GUNTAKAL — SECUNDERABAD

*For Territorial Rights Apply to:*

**SOBHANACHALA PICTURES LTD.**

**TEYNAMPET :: MADRAS**

*For Mysore:*

**YASODHARA FILM CORPORATION**

**BANGALORE CITY**


CP-226




## ఇండియా సిరామిక్స్ లిమిటెడ్

నెల్లూరు :: కాళహస్తి :: మద్రాసు

## ఈస్ట్ & వెస్ట్ ఇన్షూరెన్సు కంపెనీ, లిమిటెడ్, బొంబాయి

[1913లో స్థాపితము]

ప్రధానకార్యాలయం: 'ఈస్ట్ అండ్ వెస్ట్ బిల్డింగ్', ఫోర్టు, బొంబాయి.

34 సంవత్సరాలుగా దేశసేవచేస్తూ జాతీయోన్నతి
పెంపొందిస్తూ ఉన్న ప్రముఖ భారతీయ భీమా సంస్థ.
ఆర్థికంగా సుస్థిరమై, పాలసీదార్లతోనూ, ఏజంట్లతోనూ
వ్యవహరించుటలో సంస్కారానికి పేరెన్నికగన్న సంస్థ.
**1944**లో జరిపిన అదనపు వ్యాపారం కోటి రూపాయలు మించింది.

చురుకైనటువంటివీన్నీ, పలుకుబడి కలిగినటువంటివీన్నీ వ్యక్తులు
ఏజన్సీలకొఱకు దరఖాస్తులు పెట్టుకోవచ్చును.

<u>వివరాలకు</u>:

మద్రాసు బ్రాంచి: | శ్రీ వి. ఎ. నాగరెడ్డి, చీఫ్ ఏజంటు,
**377**, ఎస్ప్లనేడ్, మద్రాసు 1. | రాయలసీమ ఏరియా, విక్టోరియాపేట, ఆదోని.

శ్రీ యస్. మల్లికార్జునరావు, ఆర్గనైజింగ్ సెక్రటరీ, బెజవాడ.

ఆంధ్రదేశంలోని మీ అభిమాన థియేటరులో

దీపావళి విడుదల




సిటాడెల్‌వారి

జ్ఞానసౌందరి

(తమిళం)

DIRECTION

F. నాగూర్ & జోసెఫ్ తలియత్ Jr.

FOR ANDHRA, CEDED, NIZAM & N. INDIA-

JAYALAKSHMI PICTURES RELEASE

18/312 LAKSHMANA RAO ST., PURNANANDAMPETA

BEZWADA: H.O. AMJIKARAI, MADRAS, 10.

"భారత చలన చిత్ర నిర్మాణములో నూతన శకారంభము.."

వాహినీ వారి మహోత్కృష్ట కళా సృష్టి

# యోగి వేమన

నాగయ్య; లింగమూర్తి; రాజమ్మ; పార్వతీబాయి నటించిన చిత్రం.

**29-10-48 నుండి మద్రాసులో**

**బ్రాడ్వే గెయిటీ టాకీసులలో విడుదల!**



డైరెక్టర్:
కె. వి. రెడ్డి B.Sc. (Hons.)
అసోసియేట్: కె. కామేశ్వరరావు, B.A.



**RELEASED THROUGH:**

**SRI RATNA PICTURES : MADRAS - 10.**




సంపుటి 3
సంచిక 5

సంచాలకుడు : చక్రపాణి

నవంబరు
1948

# దీపావళి

పాపాయిలూ! మీ దీపావళి పండుగ వచ్చింది. ఆవాళ మీరు తెల్లవారు ఝామునే లేచి, తలార స్నానాలుచేసి, కొత్తగుడ్డలు వేసుకుని, పిండి వంటలు తింటూ ఎప్పుడు ప్రొద్దుక్రుంకుతుందా, ఎప్పుడు టపాసులు కాలుద్దామా? అని ఎదురుచూస్తూవుంటారు. ఆనాడు మీకు ఎవరూ జ్ఞాపకం వుండరు. ఆఖరికి నన్నుకూడా మరిచిపోతారు!

పాపలూ! ఆనాడు మీరు అందరినీ మరిచినా బీదపిల్లలను మరవకండి. మీ చేతులోవున్న టపాసులు వాళ్లనుకూడా కాల్చనివ్వండి. అలా టపాసు లివ్వకపోతే కనీసం నన్ను అయినా యివ్వండి, వాళ్లు చదువుకోటానికి. ఏం? ఇస్తారు కదూ?

మీ చందమామ.



# ఏది చదువు?

పడుతు, పడుతు శాస్త్రిలొకరు
పడవరేవు చేరెను
అపుడె నీట ద్రోయుచున్న
అవిటి పడవ నెక్కెను.

ఎక్కి చంకనున్న చిన్న
బొక్కసాను సర్దెను
సర్ది చదరమీద కాళ్లు
సాచి చేరగిల్లెను

గాలి కెగురు పిలక ముడిచి
సాలు వొకటి గప్పెను
పడవ నడపువాని మోము
పాఱ జూచి యిట్లనెన్.

శాస్త్రి

నీటి బ్రదుకు, కాటి బ్రదుకు
నీచమైన దందురు

పల్లెకారి

విసపు బుర్వులకును విసము
వెగటు గాదు బాబయా?

శాస్త్రి

దానధర్మ మన్న దెన్న
డైన జేసికొంటివా?

పల్లెకారి

త్రావ గంజి లేని మేము
దాన ధర్మ మేద్తుమా?

రచన :

# ఏటుకూరి

శాస్త్రి

డొక్కశుద్ధికైన నొక్క
ముక్క నేర్చుకొంటివా ?

పల్లెకారి

మేము ముక్క నేర్చుకొన్న
స్వాములేమి గావలెన్.

శాస్త్రి

"అయితె నీదు బ్రదుకు వ్యర్థ
మయిన" దనియె నింతలో

హోరుగాలి వీచి పడవ
బోరగిల్ల బడ్డది
శాస్త్రి లదిరిపోయి గుండె
జారి గోలపెట్టెను

పల్లెకారి

ఇంత చదివినట్టి తమరి
కీత రాదు బాబయా ?

శాస్త్రి

"ఆపదలకు బనికిరాని
వన్ని వచ్చు పుణ్యుడా !"

అనుచు గ్రుడ్లు తేలవైచి
అడుగుపట్టె శాస్త్రిలు
పల్లెకారి యీది యొడ్డు
పట్టి తిరిగి చూచెను.









# దీపావళి

[ప్రయాగ]

దీపావళొచ్చింది పాపాయిలూ!
దివ్వెల్లు వెలిగించు దీపావళీ!
దిబ్బు దిబ్బూ దిబ్బుదీపావళీ!
మళ్లాను వచ్చేటి నాగుల్లచవితి.

పట్టుపావడ గట్టి పాపాయి వచ్చింది
పట్టుజుబ్బా తొడిగి పాపడే వచ్చాడు
జట్టుపట్టాలేసి జగములే వెలిగించు
చిట్టిపాపలకెల్ల దీపావళీ.

చిటపటల ఢమఢమల దీపావళీ
జువ్వల్ల చక్రాల దీపావళీ
చిచుబుడ్ల మహతాబి దీపావళీ
రంజుగా కాల్చాలి, రండి రారండోయి!

ఆకాశదీపాల దీపావళీ
రాకాసి మడిసిన దీపావళీ
కన్నెనోముల పంట దీపావళీ
క్రొంగ్రొత్త స్వాతంత్ర్య దీపావళీ.




వంగదేశంలో చైతన్యుడు ఒకగొప్పభక్తుడు. చైతన్యుడు పేరొందిన పండితుడు. న్యాయ శాస్త్రంలో నిధి.

ఒకనాడు చైతన్యుడు పక్క వూరికి వెళదామని బయల్దేరాడు. మధ్యదారిలో నది దాటాలి. సరే, నదిమీద మెల్లిగా పడవ సాగుతూంది.

పడవప్రయాణం చేస్తూంటే ఆ చెట్లూ, పుట్టలూ, కొండలూ, మేఘాలూ–ఆ దృశ్యాలన్నీ చూచి చైతన్యుడు తన్మయుడయ్యాడు. ఆ ఆనందానికి మేర లేక పోయింది. ఆనందంలో మన ప్రపంచమే మరిచిపోయాడు.

అటువంటిస్థితిలో ఒకాయన చైతన్యుణ్ణి తట్టిలేపాడు. తెలివిలో పడి చైతన్యుడు ఇట్లా అన్నాడు: 'గదాధర్! నువ్వేనా? ఎన్నాళ్లకు కలుసుకున్నామోయ్!! గురువుగారి ఆశ్రమం వదలిన తరవాత ఇదే మనం చూచుకోటం. నా హృదయంలో ఎంత ఆనందం కలిగిందో చెప్పతరం కాదు.'

నేస్తులిద్దరూ మనసు విడిచి పిచ్చాపాటీ మాటాడుకున్నారు. చిన్ననాటి ముచ్చటలు నెమరుకి తెచ్చుకుని ఎంతగానో పొంగిపొయ్యారు.

'అవునుగాని, మన గురువుగారికి మాట ఇచ్చావు జ్ఞాపకమున్నదా, ప్రపంచం యావత్తూ దిగ్భ్రమ చెందేటట్టుగా న్యాయ శాస్త్రం రచిస్తానని?' అని జ్ఞాపకం చేశాడు గదాధర్.

'అవును, రచించాను, నా మాట నిలబెట్టుకున్నాను. అది చూచి నువ్వు చాలా సంతోషిస్తావనుకుంటాను,' అని చెబుతూ,

వ్రజ మోహన్



తను వ్రాసిన పుస్తకం గదాధర్ చేతి కిచ్చాడు, చైతన్యుడు.

అది చదువుతూ గదాధర్ అమితంగా ఆశ్చర్యపోయాడు. ఐతే ఎంతఉత్సాహంతో చదవటానికి ప్రారంభించాడో, క్రమంగా అతనిలో అంత విచారమూ అగపడింది. ఇక చదువు సాగిందికాదు. టపీమని పుస్తకం మూసివేసి, చైతన్యుడికి తిరిగి ఇచ్చివేశాడు. కాస్సేపు మౌనంతాల్చి, ఒక్క పెద్ద నిట్టూర్పు విడిచాడు.

'ఎందుకోయి గదాధర్, విచారపడు తున్నావ్? మధ్యలోనే పుస్తకం మూసివేశా వేమి? ప్రాణస్నేహితుడను కదా, నాతో చెప్పకూడదా?' అని అనేకవిధాల బుజ్జ గించి అడిగాడు చైతన్యుడు.

గదాధరుడికి నోట మాట రావటంలేదు. పైగా కన్నుల వెంట బాష్పాలు రాలు తున్నాయి. పక్కకి తిరిగి కన్నీళ్లు తుడుచు కుంటున్నాడు. అయినా దుఃఖం ఆగడంలేదు.

'వెయ్యిగ్రంథాలు రాస్తేమాత్రం ఫలిత మేమిటి, ఒక్క మిత్రుడి విచారం తొల గించ లేనప్పుడు? బాల్యంలో ఎట్లా గడి పామో అదేవిధంగా యిప్పుడుకూడా నీ కష్టసుఖాలు పంచుకోటానికి అవకాశ మియ్యవా నాకు?' అని చైతన్యుడు పరి పరి విధాల బ్రతిమలాడాడు.

చివరికి తన మనసులో వున్న మాట ఇట్లా చెప్పివేశాడు గదాధరుడు :

'చైతన్యా! ఏమి చెప్పమంటావు! నా జీవితం యావత్తు ధారపోసి, పండితులు మెచ్చేటటువంటి న్యాయశాస్త్రం నేనూ ఒకటి రచించాను. కాని.... నువు వ్రాసిన దాని ముందు అది దిగదుడుపే! అయ్యో,



నా జీవితం వృథా అయినందుకు పరిత పిస్తున్నాను...'అని గదాధర్‌వాపోయ్యాడు.

అప్పుడే కారుమేఘాలు కమ్ముకు వస్తున్నాయి. గొప్ప వర్షం వచ్చేటట్టుంది. ఒకరి కొకరు ఏమీ బదులు చెప్పలేని పరిస్థితి యేర్పడింది. అంచేత, మిత్రులిద్దరూ మౌనంగా నీళ్ళలోకి చూస్తూకూర్చున్నారు.

ఏవిధంగా గదాధరుడికి సాయపడటమా, ఎట్లా అతని విచారం పోగొట్టడమా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు చైతన్యుడు. తొడమీద వున్న తన పుస్తకాన్ని చేతపుచ్చుకున్నాడు. ఆ చిరుచీకట్లో దాన్ని గభీమని గంగార్పణం చేసివేశాడు.

ఆ నిమిషాన చైతన్యుడి వదనం మతాబీ వెలుగువంటి తేజస్సుతో నిండిపోయింది.

'చైతన్యా! ఎంతపని చేశావోయి!! – ఇట్లా చేస్తే నేను సంతోషిస్తాననుకున్నావా? ఇందువల్ల నాకు అపవాదు రావటం, నీ కీర్తి శాశ్వతంగా నిలిచిపోవటం జరిగింది. నువు ఉత్తమమైన గ్రంథం రాసినందుకు నేను అసూయపడ్డమాట నిజమే. కాని ఆ అసూయ, ఆ విచారము అప్పటికప్పుడు పోయేవే. అంతమాత్రంచేత అమూల్యమయిన గ్రంథాన్ని లోకానికి లేకుండా



చేస్తావా? అసలు నేనే, నా పుస్తకాన్ని గంగార్పణం చేదామని అనుకుంటున్నాను. ఇంతలోనే నువ్విటువంటి పని చేశావు. ఇంతకీ, నేను నా మనస్సులో వుండే విచారాన్ని దాపరికంలేకుండా ప్రాణమిత్రుడవని, నీకు చెప్పినందుకేకదా ఈ పని? చైతన్యా, ఎంతపని చేశావోయ్? ఇప్పుడింక ఏమనుకుంటే ఏం లాభం?—' అని అనేకవిధాల పరితపించాడు గదాధరుడు.

'గదాధర్! నువ్వెంతమాత్రం అలా విచారించవద్దు. మనిద్దరమూ ఒక్క గురువు



శిష్యులం. కనుక, పుస్తకం నువు రాసినా ఒకటే, నేను రాసినా ఒకటే. నీ పుస్తకమే లోకానికిఅందజేయటం నాకు కుతూహలం. నీ గ్రంథాన్ని పండితులు మెచ్చుకుంటారు. గొప్పగా ప్రచారమవుతుంది. అందరూ చదువుతారు. నీకు కీర్తి వస్తుంది. నువ్వు యెంతమాత్రము విచారింపవలసిన పని లేదు. అదీగాక—ఈ పుస్తకం రాస్తున్నాళ్లూ ఇది ఎందుకు రాస్తున్నానా అని పించేది మనస్సుకి. ఎందుకో నాకే తెలియదు. పుస్తకం గంగార్పణం చేయటంలో నిన్ను సంతోషపెట్టడమేకాదు నా వుద్దేశం. ప్రతిదీ ఒక మంచికే. నాలో వుండే అహంకారం పోవాలని నేను చేసినపని ఇది. అహంకారం నశించటానికి ఇటువంటివి ఒకటికాదు, లక్ష గ్రంథాలైనా గంగార్పణం చేయాల్సిందే. కనుక నువ్వెంతమాత్రం విచారించవద్దు.

'గదాధర్! నవ్వు—ఒక్క సారి నవ్వు!! అదుగో, నీపెదవుల్లోనించి నవ్వు వస్తున్నది. ఎన్నడూ దాన్ని అణచి వేయకు. మానవుడికి సంతోషమే స్వర్గము' అని చైతన్యుడు గదాధరుణ్ణి ప్రోత్సహించాడు.

ఇద్దరి హృదయాల్లోనూ సంతృప్తి, ఆనందమూ తాండవించాయి. మళ్లీ వారుభయులూ నీళ్ళలోకి చూస్తూ కూర్చున్నారు. అయితే, ఈసారి మిత్రు లిద్దరూ ప్రేమతో ఒకరి భుజంమీద రెండవవారు చేతులు వేసుక్కూచున్నారు.

'ఈ ప్రపంచంలో సమస్త జనులూ సంతోషంగా, సుఖంగా ఉండటమే నాక్కావాల్సింది. అదే నా మతం. కనుక, నీ విచారం తొలగించి, సంతోషం కలిగించేందుకు నేను ఒక్క పుస్తకాన్నే కాదు, ప్రాణాలయినా అర్పిస్తాను' అని అన్నాడు చైతన్యుడు.

'చైతన్యా! నీ త్యాగం ఇటువంటిదని చెప్పి నేను నోటిమాటలతో వర్ణించలేను. కృతజ్ఞతఅనే ప్రసన్న గుణంతో నాహృదయం నిండిపోయింది. నీ త్యాగాన్ని గురించి లోకమంతటా చాటడమే ఇక నా విధి'' అని సంతోషాన్ని తెలిపాడు గదాధరుడు.






[గతసంచిక తరువాయి]

భోజనాలు అవుతుండగా రైతుకొడుకు చప్పున వర్ధమానుణ్ణి కాలుపట్టుకుని పైకెత్తి చేతిలో అటూ ఇటూ తిప్పి చూడసాగాడు. వర్ధమానుడి పై ప్రాణాలు పైనే పోయినాయి. ఆ ఎత్తునుంచి ఆ కుర్రవాడు తనను జారవిడిస్తే చావుతప్పదు. కాని వాడిధర్మమా అంటూ రైతు తనకొడుకును కొప్పడి వర్ధమానుణ్ణి సురక్షితంగా కిందదించాడు.

భోజనా లయినాక రైతుభార్య వర్ధమానుణ్ణి జాగ్రత్తగా పట్టుకొని తీసుకుపోయి ఒక పక్క మీద పడుకోపెట్టింది. ఆ మంచం అంచునుంచి కిందికిచూస్తే వర్ధమానుడి కళ్లు తిరిగిపోయాయి. అంత పెద్దపక్క అతనెన్నడూ చూడలేదు. దాని మీది దిండ్లే మామూలు పరుపులకు ఎన్నో రెట్లున్నాయి. ఆ పక్కలో పడుకుని వర్ధమానుడు గాఢనిద్రలో మునిగిపోయాడు.

అతనికి మెళుకువ వచ్చేసరికి అర్ధరాత్రి అయింది. అంతటా నిశ్శబ్దంగా ఉంది. "ఈ రాక్షసుల మధ్యనుంచి నేను ప్రాణాలతో బయటపడగలనా? ఇక్కడ ఇంకా ఎన్ని ఆపదలు ఎదురౌతాయో?" అని వర్ధమానుడు చింతిస్తూ ఉండగానే భయంకరమైన అలికిడి అయింది. అదేమిటో అని అతను చూసేసరికి రెండు ఎలుకలు కలుగులోనుంచి వచ్చి ఒకదాని వెంట ఒకటి చరచరా గదియావత్తు తిరగసాగాయి.

ఆ ఎలుకలు చిన్న దున్న పోతులంతేసి ఉన్నాయి. వాటిని చూసి వర్ధమానుడు చాలా కంగారు పడ్డాడు. అతని భయానికి

జోనాథన్ స్విఫ్టు వ్రాసిన 'గల్లివర్స్ ట్రావెల్సు'కు అనుకరణ



తగ్గట్టుగానే వాటిలో ఒకటి చెంగున అతని మంచంమీదికి ఎగిరి నల్లగా మెరిసే పింగాణి బొమ్మలవంటి కళ్లతో అతనికేసి చూసి, ముందుకాళ్లు రెండూ ఎత్తి అతనిమీదికి దూకింది. అతనిఒరలో కత్తి ఉంది. వర్ధమానుడు ధైర్యం చిక్కబట్టి కత్తిదూసి ఆ ఎలుక గుండెలో బలంగా పొడిచాడు. అది తక్షణమే చచ్చి పడిపోయింది. ఇంతలోనే రెండవ ఎలుకకూడా మంచంమీదికి దూకింది. వర్ధమానుడు దానిమీదికి కత్తి విసిరాడు. చిన్నగాయంతో అది తప్పించుకు పారిపోయింది.

వర్ధమానుణ్ణి యెవరు సాకట మనేది సమస్య అయింది. ఆఖరుకు అతన్ని రైతు కూతురయిన చిత్పలకు యిచ్చి జాగ్రత్తగా ఆడుకోమన్నారు. ఆమెకు తొమ్మిదో ఏడు. ఏడుగురు మనుష్యుల ఎత్తున్నప్పటికీ వారి లెక్కకు ఆమె పొట్టిపిల్ల. ఆమె చాలా సాధువు. అందుచేత వర్ధమానుడికి ఏమీ అపకారం జరగదని రైతు నమ్మాడు.

"ఇది నా బుల్లిపాప. దీన్ని నేను నా బొమ్మలతొట్టిలో పెట్టుకొని చక్కగా రోజల్లా ఆడుకుంటాను" అనుకున్నది చిత్పల.

ఆమె తన బొమ్మలతొట్టిలో మెత్తని గుడ్డలు పరిచి అందులో వర్ధమానుణ్ణిపెట్టి, ఎలుకల కందకుండా, ఎత్తుగా గూట్లో దాచింది. రాత్రంతా వర్ధమానుడు అందులోనే గడిపేవాడు. పగలల్లా తన వెంట తిప్పి తన స్నేహితురాళ్లకి చూపుతూ, అతనికి ఒకొక్కక్క మాటచొప్పున తమ దేశ భాష నేర్పింది. అతనికోసం కష్టపడి చొక్కాలూ, లాగులూ కూడా కుట్టింది. అంతంత చిన్న బొమ్మగుడ్డలు కుట్టటం ఆమె కెంతో కష్టమయింది.



చిత్పల తండ్రికి ఒక బుల్లిమనిషి దొరికిన వార్త చుట్టుప్రక్కలవారికి తెలియకుండా ఉంటుందా? వర్ధమానుణ్ణి చూడటానికి ఇరుగు పొరుగు వాళ్లు తీర్థప్రజగా రాసాగారు. చిత్పల తండ్రితో కొందరు రైతుస్నేహితులు, "చూస్తా వేమిటి? ఇంత మంచి వింత దగ్గిరపెట్టుకుని; ఎంతయినా డబ్బు చేసుకోవచ్చునే!" అన్నారు. రైతుకీ ఆ సలహా నచ్చింది. వర్ధమానుణ్ణి సంతకు పట్టుకెళ్లి టిక్కెట్లుపెట్టి జనానికి చూపితే ఎంత డబ్బయినా వస్తుంది. ఈ పని ఇదివరకే చెయ్యనందుకు చాల విచారించాడు రైతు. అయిందేదో అయిపోయింది గనక మర్నాడు సంతకు తీసుకుపోవటానికి 'బుల్లిపాపను' సిద్ధం చెయ్యమని చిత్పలతో చెప్పాడు.

తన బుల్లిపాపను ఇట్లా సంతలో పెట్టి తన తండ్రి డబ్బుచేసుకోవటం చిత్పలకేమీ ఇష్టంలేదు. అది తన బుల్లిపాపకెంతో అవమానం. అదీకాక డబ్బిచ్చి ముదనష్టపు మనుషులంతా తన బుల్లిపాపను కాలూ చెయ్యీ విరిచి బాధిస్తారేమో అనే భయంకూడా చిత్పలకు లేకపోలేదు. ఈ విషయాలన్నీ చిత్పల చిన్నిపాపతో చెప్పి ఏడిచింది. ఆమెకు తన తల్లిదండ్రులమీద చాలా కోపము కూడా వచ్చింది. సంతకు పట్టుకెళ్లి డబ్బులు తీసుకుని అందరికీ చూపదలచుకొన్నవాళ్లు బుల్లిపాప తనదేనని ఎందుకు చెప్పాలే? కిందటేడు కూడా ఇంతే; మేకపిల్లను తనకు ఆడుకోనిచ్చి అది కాస్త వొళ్లు చెయ్యగానే కసాయివాడికి అమ్మేశారు. ఏం మనుషులు?

కాని వర్ధమానుడు ఆమెను ఊరడించి "ఊరుకో, ఏడువకు. నాకేమీ ఆపద రాదు

నాకు కూడా అందర్నీ చూడాలనీ, ఎక్కడి కైనా వెళ్లాలనీ ఉంది. నువు వెంట రాకుండా మీ నాన్నగారు నన్ను సంతకు తీసుకుపోడులే. నేను నీ మాట తప్ప ఎవరి మాటా విననుగా!" అన్నాడు. వర్ధమానుడికి సంత కెళ్ళటం నిజంగా ఏమాత్రమూ ఇష్టంలేదు. కాని ఇల్లుదాటి బయటికి వెళ్లితే తప్పించుకుని పారిపోయే మార్గం ఏదైనా దొరుకుతుందేమో నని అతని ఆశ.

ఒక పెట్టెలో మెత్తలు పరిచి, అందులో వర్ధమానుణ్ణి పెట్టి, అతనికి ఊపిరాడటానికి పెట్టెకు కంతలుచేసి, అతను బయటికి లోపలికీ రాగలందులకు, పెట్టెకు తలుపాకటి పెట్టారు. ఆ పెట్టెను గుర్రంమీద పెట్టుకొని రైతూ, చిత్ర లా తెల్లవారు ఝామునే సంతకిబయలుదేరారు. భోషాణం లాగున్న ఆపెట్టెలో వర్ధమానుడు సుఖంగా కూర్చున్నాడు. చిత్రల ఆ పెట్టెను తానే పట్టుకుంది. ఇప్పుడు వర్ధమానుడు డబ్బు తెచ్చే సాధనం కనక రైతుకూడా అతని విషయం ఎంతో శ్రద్ధగా ఉన్నాడు.

అయితే గుర్రం నడక వర్ధమానుడికి చాల బాధకలిగించింది. అది బ్రహ్మాండమైన అంగలువేస్తూ పోతుంటే వర్ధమానుడికి





గాలిలో ఎగురుతూ పడుతూ పోతున్నట్టున్నది. తుపానులో కొట్టుకునే పడవలో ఉన్నప్పటికీ అతనికింత బాధ కలిగి ఉండదు.

ఎట్లాగైతేనేం సంతకు వచ్చారు. అక్కడే సత్రంలో ఒక గదికి అద్దె యిచ్చి రైతు "బుల్లిపాప"ని ప్రదర్శనానికి పెట్టాడు. గది మధ్య ఒక ఎత్తయిన బల్ల పెట్టారు. బల్లమీద వర్థమానుణ్ణి నిలబెట్టారు. అతని పక్కనే ఆ బల్లమీదే చిత్పల కూర్చున్నది— అతనికి ఆ పనీ ఈ పనీ చెప్పి చేయించటానికి. ప్రదర్శనం ఆరంభమైన మరుక్షణంలోనే ప్రేక్షకులు ఇసకవేస్తే రాలకుండా కిక్కిరిసిపోయి ఒకరినొకరు తోసుకోసాగారు. వారంతా "బుల్లిపాప" గురించి అనేక సంగతులు ఇదివరకే విన్నారు. అదంతా కళ్లారా చూసేటందు కిప్పుడు వారికి అవకాశం దొరికింది.

చిత్పల తనభాషలో వర్థమానుడికి కొన్ని ప్రశ్నలువేసి ఆ భాషలోనే సమాధానాలు చెప్పించింది. ఇంత బుల్లిమనిషి తమ భాష మాట్లాడడంవిని అక్కడచేరిన మూఢ ప్రజలు పొట్టలు పట్టుకొని నవ్వసాగారు. ఆ తరవాత చిత్పల తన బుల్లిపాపను నడవమన్నది. చిన్న ఉగ్గుగిన్నెలో మంచి నీళ్లు పోసి అతన్ని తాగమన్నది. వర్థమానుడు ఈ పనులన్నీ చేశాడు. అటు తరవాత అతను తన కత్తిదూసి సాముచేసి చూపించాడు. చిత్పల అతనికొక గడ్డిపరక అందించింది. దాని సహాయంతో వర్థమానుడు రకరకాల మొగ్గలు వేశాడు, ఇవన్నీ చూసి ప్రేక్షకులు ముక్కుమీద వేలు వేసుకుని విస్తుపోయినారు.

ఈ విధంగా వర్థమానుడు తన యజమాని అయిన రైతుకు డబ్బు చేసిపెట్టసాగాడు. వర్థమానుడివల్ల డబ్బు రావటం



ఆరంభం కాగానే రైతు స్వార్థపరుడు కాసాగాడు. వర్ధమానుడికి ఎవరివల్లా ఏ అపాయమూ కలగకుండా ఉండగలందులకు ఆ రైతు, చిత్రల తప్ప మరెవ్వరూ బుల్లిపాపను ముట్టుకోరాదని శాసించాడు. చూడవచ్చేవాళ్ళు చేతులు చాచి వర్ధమానుణ్ణి అంటుకోకుండా కట్టుదిట్టాలు ఏర్పరిచాడు.

అయినా ఒకరోజు ఒక అల్లరి పిల్లవాడు వర్ధమానుడిమీదికి ఒక చింతగింజ విసిరాడు. కాస్తలో తప్పిపోయింది గాని, ఆ గింజ తలకు తగిలితే వర్ధమానుడుకి తల పగిలిఉండవలసిందే. ఆ కుర్రవాణ్ణి మెత్తగా తన్ని గదిలోనుంచి బయటికి గెంటారు, వర్ధమానుడి కళ్ళు చల్లగా.

మళ్లీ మళ్లీ ప్రదర్శనాలు జరిగాయి. జనం తండోపతండాలుగా వచ్చేవారు. చేసినపనులే మళ్లీ మళ్లీ చేసి వర్ధమానుడు తెగ అలిసిపోయేవాడు. ఒక్కొక్కసారి స్పృహతప్పి కూడా పడిపోయేవాడు. రైతుకుమాత్రం పరమానందంగా ఉండేది. ప్రతిసారీ రెండుజేబులా డబ్బులు నించుకుని రైతు ఇంటికి తిరిగివచ్చేవాడు. బుల్లిపాప ధర్మమా అంటూ రైతుదరిద్రం తీరేటట్టు కనిపించింది.

సంతలో ప్రదర్శనాలద్వారా డబ్బు సంపాదించటం రైతుకు మామూలువిషయమైపోయి పెద్ద ఆలోచనలు చెయ్యసాగాడు. పట్టణానికి వెళ్లి "బుల్లిపాప"ను ఆస్థానంలో ప్రదర్శిస్తే అప్పుడుగాని ఐశ్వర్యం అందుకోదు. ఇక్కడ ఈ మారుమూల పల్లెటూళ్లలో ఎన్నిప్రదర్శనాలు పెట్టి ఏంలాభం?

రైతు తనభార్యకు ముందుగా ఈ ఆలోచన చెప్పి చిత్రలతో ఇట్లా అన్నాడు:

"మనమే... బుల్లిపాపను తీసుకుని రాజుగారిదగ్గిరికి వెళ్ళామంటే... రాజూ రాణీకూడా... మన బుల్లిపాపను చూసీ... ఎంతో సంతోషిస్తారు! చక్కా మనకీ... బోలెడు డబ్బులిస్తారు.... నువ్వే దగ్గిరుండీ ... మన బుల్లిపాపనీ.... రాజుగారికీ.... రాణీగారికీ... చూపిద్దుగాని! ఏం?"

—[ఇంకా వుంది]






ఆ జమీందారుగారికి పెద్దబంగాళా, తోటా, దాసీలూ, బోలెడంత ధనమూ వుంది. ఆయనకి పిట్టల్ని పెంచడం చాలా సరదా. దేశంలో రకరకాల పక్షుల్ని పట్టి తెప్పించి, దూరదేశాలనుండి కూడా పిట్టల్ని కొని తెప్పించి, బంగాళానిండ పెద్ద పెద్ద పంజరాలు తయారుచేసి, అందులో వాటినివుంచి వాటికోసం బంట్రోతుల్ని ఏర్పాటుచేసి చాలా ప్రేమగా పెంచుకుంటున్నాడు.

జమీందారుగారి ఆస్థానంలో లేనిపక్షి మరీ ప్రపంచంలో ఎక్కడా లేదన్నమాటే. శ్రీవారి తోటమాలికి యిద్దరు కొడుకులున్నారు. వాళ్లు రోజూ ఆ పక్షులతో ఆడుకుంటూ, వాటికి మేతపెడుతూ పక్షుల్లో పక్షులై ఆనందంగా కాలక్షేపం చేస్తున్నారు. సుమారు లక్షరకాల పక్షులు ఆ ఆస్థానంలో చేసే కిచకిచలు, కూసే కూతలు మధురమైన సంగీతంలా వినబడుతుంది.

ఇలావుండగా ఒకనాడా తోటమాలి పిల్లలకి ఆ పక్షులమీద జాలికలిగింది. హాయిగా అడవులంటా, చెరువులంటా, నదీతీరాలంటా స్వేచ్ఛగా ఎగిరి, పళ్లు కాయలు తినే పిట్టల్ని పంజరాల్లో పెట్టి బంగారం మేతవేస్తే మాత్రం ఏం లాభం అనుకున్నారు.

ఆలోచించి, ఆలోచించి వాళ్లు ఒకనాటి రాత్రి నిశ్చయించుకున్నారు— పక్షులకి స్వరాజ్యం యిద్దామని. ఆమట్టునే సరిగ్గా రాత్రి పన్నెండు గంటలకి పంజరాల తలుపులన్నీ తీసేశారు. పక్షులన్నీ

మారెళ్ళరాజు, బరంపురము




ఝుమ్మున రివ్వున ఎగిరి ఆకాశం అందుకున్నాయ్. ఆ తోటమాలి పిల్లలు ఆనందభరితులైనారు.

ఉదయం జమీందారుగారు నిద్రలేస్తునే పిట్టకూతలు వినపడకపోవటానికి ఆశ్చర్యపడి, కళ్లు నులుముకొంటూ గబగబ తోటలోకి వెళ్లి చూసేరు. నిలువునా నీరైనారు. ఒక్క పిట్టా కనబడదు. ఎన్నోలక్షలు ఖర్చుపెట్టి అనేక దేశాలనుండి అనేకరకాల పిట్టల్ని తెప్పించారాయె. కాని, మచ్చుకొక్కటీ కనబడక మాయమైపోయినాయ్. కోపంగా నౌకర్లనందర్నీ పిళిచి నిలదీసి నిజం చెప్పమన్నారు. ఆఖరికి రహస్యం బయలుపడింది. తోటమాలి పిల్ల లిద్దర్నీ తీసుకువెళ్లి దూరంగా అడివిలో వదిలేసి రమ్మన్నారు జమీందారుగారు.

ఆపిల్లలిద్దరూ బలేసంతోషంతో గెంతేరు. మేంకూడ పక్షిరాజ్యంలోకి పోతాంఅన్నారు. వాళ్ళ అమాయికత చూసి వాళ్ళ నాన్న నెత్తీనోరు మొత్తుకున్నాడు. లాభం లేకపోయింది. ఆ పిల్లల్ని బంట్రోతులు తీసుకెళ్లి దూరంగా అడవిలో విడిచేసి వచ్చారు.

పాపం వాళ్లకా అడవిలో ఎవరూదిక్కు? గాలీ, వాన, చలీ, ఆకలీన్నీ. వాళ్లు లోలోపలే ఏడుస్తుంటే కొన్నివందల చిలకలు, పిచికలు అక్కడ తయారైనాయి. వాటిని చూడగానే ప్రాణాలు లేచొచ్చాయ్ వాళ్ళకి. బాగా పరిచయమున్న వాటిలాగ అవి పిల్లల చుట్టు మూగిపోయేయ్. అన్నట్టు ఆ పిట్టలన్నీ, జమీందారుగారి ఆ స్థానంలోవే. మంచి మంచి పళ్ళూ, ఫలాలు తెచ్చి

కొల్లలు కొల్లలుగా పడేసేవి. అవన్నీ తిని కడుపునింపుకొని ఆ ఇద్దరూ ఆ అడవిలోనే చిన్న పొదరిల్లు కట్టుకొని హాయిగా ఉన్నారు.



ఇక్కడ జమీందారుగారి ముద్దుకూతురికి జబ్బుచేసింది. అదేమిటంటే బెంగజబ్బే! ఆ అమ్మాయికి కలలో పంచరంగుల మామిడిపండు కనపడిందట. అది కావాలని పట్టుపట్టి కూచుంది. ఎన్నిచేసినా, ఏం యిచ్చినా ఆ అమ్మాయి జబ్బు నిమ్మళించలేదు. ఆఖరికి జమీందారుగారు నిరాశ చేసుకొని పంచరంగుల మామిడి పండు ప్రపంచంలో దొరకదనే నిరుత్సాహంచేత ఏమీతోచక దండోరా వేయించారు. పంచరంగుల మామిడిపండు తెచ్చినవారికి లక్ష రూపాయలు బహుమానం యిస్తామని.

ఈ వార్త గబగబా అడవిలోని తోటమాలి కొడుకులకితెలిసింది. ఆనాటినుండీ పక్షులు తెచ్చే రకరకాల పళ్ళన్నీ జాగ్రత్తగా పరీక్ష చేసి మరీ తింటున్నారు. ఒకనాడు గారిడీలాగ ఒక హంస పంచరంగుల మామిడి పండు తీసుకొచ్చి ఆపిల్లలమధ్య పడేసింది. వాళ్లు సంతోషంతో పొంగిపోయి ఆ పక్షుల్నే దేవతలుగా భావించి, మారువేషంతో ఆ పండు తెచ్చి జమీందారుగారి కిచ్చారు.

ఆ పండుతో ఆఅమ్మాయి జబ్బు నయం కావడమూ, ఆ పిల్లలకి లక్షరూపాయిలు బహుమాన మివ్వడమూ జరిగింది. వాళ్లు తన తోటమాలి పిల్లలే అని తెలిసి తన కూతుర్ని రక్షించినందుకు వాళ్ళని మళ్లీ తన ఆస్థానంలో వుంచుకున్నాడు జమీందారు.




త్రోట్టేడు అనే గ్రామంలో ఒక తొండ ఉన్నది. దాని పేరు తొండలరాయడు. తొండల్రాయడికి ఐదుగురు భార్యలు. పెద్ద భార్య హంస. రెండవ భార్య కాకి. మూడో భార్య చిలుక. నాలుగో భార్య పిచిక. ఐదో భార్య చీమ.

కాలం గడిచిపోతూంది గాని, ఇందులో ఒక్క భార్యకూ సంతానం కలగలేదు. అదృష్టం పండి, కొన్నాళ్ళకి చిన్నారిభార్య చీమ ఒక చక్కటికొడుకును కన్నది.

చీమ కొడుకును కనటం, తక్కిన నలుగురు భార్యలకూ కంటకమనిపించింది. ఏమీ అంటే, వాళ్లు నలుగురూ చీమకంటె చాలాముందుగా కాపరానికి వచ్చినారాయె. కాని ఒక్కరికీ కూడా సంతతి కలక్కపోవటం, నిన్నగాక మొన్న వచ్చిన చీమ ఇట్టె కొడుకుని కనటం—ఇది వాళ్ళందరికీ విచారమూ, అసూయా చెందటానికి కారణమయింది.

లేక లేక కలిగిన కొడుకునీ, చిన్నారి భార్యనీ చూసుకుని తొండల్రాయుడు మురిసిపోయేడు.

ఇట్లా చిన్నభార్యమీద ఎక్కువమక్కువగా ఉండటం తక్కిన భార్యలకు కన్నెర్రగా ఉంటుందని గ్రహించాడు తొండల్రాయడు. గ్రహించి, ఇక వీళ్ళలో వీళ్ళకి ఎట్లాగా పడదని నిశ్చయిరిచాడు.

ఊరిచివర తొండలరాయడికి తోట ఒకటుంది. ఆ తోటలో ఒంటిస్తంభపుమేడ కట్టించి చీమనూ, చీమ కొడుకునూ అందులో ఉంచాడు.

చీమ చిటుక్కుమంటే అక్కడికి పరుగెత్తేవాడు తొండలరాయడు. చీమతో చెప్పందే ఏ పనీ చేసేవాడు కాదు అతను.

నూనేటి అప్పాజీ, రాజమహేంద్రవరము

దాదాపు పగలూ రాత్రీ అంతా చీమ మేడ లోనే గడుపుతూండేవాడు.

తన పట్ల తొండలరాయడు ఇంత గా గౌరవం చూపుతూవుండేసరికి, చీ మ కు ఎక్కడలేని గర్వమూ వచ్చేసింది. ఇది తక్కిన నలుగురు భార్యలకూ కిట్టేది కాదు.

ఒకనాడు పెద్ద భార్య హంస, గదిలో కూర్చుని ఇట్లా ఆలోచించుకుంది: "నేను నాకై యిప్పుడు చీమ కొడుకుని చూడబో కుంటే బాగుండదు. మనస్సులో యి ష్ట మున్నా లేకున్నా లోకానికి వెరవాలె" అని అనుకుంటూ, లేచి ముస్తాబయింది. ఏనాడో పుట్టింటివారు పెట్టినఅందెలు కాళ్ళకి పెట్టు కుని, చీమమేడకు వెళ్లి తలుపు తట్టింది.

పెద్దసవతి రావడం చూసి, గర్వించిన చీమ ఒళ్లుతెలియక ఇలాగ అన్నది:

ధూళి కాళ్ళవాళ్లు
దుట్ట కాళ్ళవాళ్లు
పేడ కాళ్ళవాళ్లు
పెరటిగుమ్మాన రండి.

అసలే ఒళ్లు మండిపోతున్నదేమో, హంసకు ఈ మాటలు శూలాల్లాగ గుచ్చు కున్నాయి. కాని అవి సహించటంతప్ప ఏం చేయగలదు?



సరే, పెరటిగుమ్మాన వెళ్లి తలుపు తట్టింది. అప్పుడు చీమ గర్వంతో తలుపు తీసి, సవతికి నీళ్లిచ్చి, కూర్చుందికి పీ వేసింది. హంస కాళ్లు కడుక్కొచ్చి పీట మీద కూర్చోగానే చీమ తన ముద్దు కొడుకుని చేతి కిచ్చింది.

హంస పిల్లవాణ్ణి ఎతుకొని ముద్దులాడు తుండగా మధ్యని చీమ ఇట్లా అన్నది "అక్కా! ఎక్కడయినా హంస కాళ్ళక అందెలు పెట్టుకుంటుందా? ఏమి చోద్య మమ్మా" అని.



ఈ మాటకి కోపం పట్టలేక—

"చీమ ఏమిటి, కొడుకుని కనడమేమిటి?" అని అనేసి, లేచి, చీమ కొడుకుని అక్కడనే పారేసి, హంస ఇంటికి వచ్చి, కాళ్ళఅందెలు తీసివేసి, తలకు గుడ్డ కట్టుకొని చీకటిగదిలో పండుకుంది.

కొంచెంసేపటికి, కళ్ళకి కాటుక పెట్టుకొని సవతికొడుకుని చూచివద్దామని రెండవ భార్య కాకి, బయల్దేరింది. పెద్ద భార్యకి మోస్తరుగానే ఈమెకు కూడా పరాభవం జరిగింది. పిల్లవాణ్ణి ఎత్తుకుని కాకి ఆమాటా యీమాటా అడుగుతుండగా, "అక్కయ్యగారూ!- కాకి ఎక్కడైనా కళ్ళకు కాటుక పెట్టుకుంటుందా?" అని అడిగింది చీమ. అసలే కోపంతో ఉన్న కాకి, అనవలసినమాటలు రెండూ అనేసి, సవతికొడుకుని అక్కడనే పారేసి, ఇంటికి వచ్చి తలకు గుడ్డ కట్టుకు పడుకున్నది.

మరికొంత సేపటికి, మూడవ భార్య చిలుక చీర సింగారించుకొని సవతి కొడుకుని చూడబోయింది. "చిలక ఎక్కడన్నా చీరె కడుతుందా?" అన్నది చీమ. ఆ మాటతో చిలుకకూడా వాళ్లలాగానే ఇంటికి వచ్చేసి తలకు గుడ్డ కట్టుకు పడుకుంది.

ఇంకొంచెంసేపటికి నాలుగోభార్య పిచ్చికమ్మ కూడా కాళ్ళకు పిల్లేళ్లు పెట్టుకొని సవతి కుమారుణ్ణి చూడటానికెళ్లింది. "పిచ్చిక ఎక్కడన్నా కాళ్ళకు పిల్లేళ్లు పెట్టుకుంటుందా?" అన్నది చీమ. ఆమెకూడా తక్కిన అక్కల్లాగే ఇంటికి వచ్చేసి, తలకు గుడ్డ కట్టుకు పడుకుంది.

ఇంతలో వేటకి వెళ్లిన తొండలరాయుడు ఇంటికి వచ్చాడు. ఎవరూ కనపడరు. ఎవరూ పలకరు. కాళ్ళజోళ్లు విప్పేవారు లేరు. బట్టలు అందుకునేవాళ్లు లేరు.



చివరికి కాళ్లు కడుక్కో నీళ్ళిచ్చి కాసిన్ని మంచినీళ్లు కావాలా అని అడిగినవాళ్ళు కూడా లేకపోయారు.

సరి, ఇది పనికాదని చీకటిగదుల్లోకి వెళ్ళి చూచాడు. చూసేసరికి— మాసిన బట్టలతో, మూసిన కన్నులతో ఒక్కొక్క రాణీ అగుపడ్డారు. ఎప్పు డెప్పుడు వస్తాడా భర్తగారు అని ఎదురుతెన్నులు చూస్తున్న రాణీలు నలుగురూ తాము పొందిన పరాభవాల్ని పూసగుచ్చినట్టు చెప్పకొని వల వల యేడ్చేశారు.

వాళ్లు ఎంత చెప్పినా తొండ్రలాయడికి నమ్మిక పుట్టలేదు.

సంగతిసందర్భాలు స్వయంగా తెలుసుకోవాలనే పట్టుదలతో తొండలరాయడు, ఆ వేటదుస్తులతోనే గదిలోది టోపి ఒకటి తగిలించుకుని, రంయ్‌మని చిన్నారి భార్య చీమమేడకి వెళ్లాడు.

చీమమ్మ తలుపుతీసింది, కుర్చీవేసింది, పిల్లవాణ్ణి భర్తచేతికిఅందిచ్చింది. ఆ మాటా యీ మాటా అయినతరవాత, ఆఖర్న— "ఎక్కడయినా తొండలరాయడు టోపీ పెట్టుకుంటాడా!" అన్నది భర్తని, మామూలు గర్వంతో.

అసలే అగ్గిలా గున్న తొండ్రలాయడికి మండుకొచ్చింది. కోపంపట్టలేక తనబూటు కాళ్ళతో అభిమాన భార్య చీమనీ, అపరూపపు కొడుకునీ ఒక్క రాపు రాసేశాడు. వాళ్లు చావగానే, మేడఅమ్మేసి, ఆ వచ్చిన ధనంతో నలుగురు భార్యలకూ నగలు నాణ్యాలు చేయించి, అంతటి నించీ వాళ్లతో హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు.

తొండలరాయడు తన తొర్రకూ మనం మన ఇంటికీ.




అనగనగా ఒక వూళ్లో వీరయ్య అనే దర్జీవా డున్నాడు. అతడు ఒక రోజున మామూలుగా అరుగుమీద కూర్చుని బట్టలు కుట్టుకుంటున్నాడు.

ఇంతలో అక్కడికి మామిడిపళ్లు అమ్మకానికి వచ్చాయి. అవి చూచేటప్పటికి వీరయ్యకు నోరూరింది. సరే, ఒక బేడపెట్టి రెండు పళ్లుకొని, వాటిని ముక్కలు చేసి అక్కడ పెట్టుకున్నాడు తిందామని.

ఈ లోపల కొన్ని ఈగలు వచ్చి ఆ ముక్కలమీద వాలినాయి. వాటిని చూడగానే వీరయ్యకి పట్టలేనంతకోపమొచ్చింది. "నేను కష్టపడి తయారు చేసుకున్న ముక్కలమీద వాలడానికి ఈ యీగలకు ఎన్నిగుండె లున్నాయి; ఎంతసాహసం! చూడు, వీటి పని పట్టిస్తా!!" అంటూ, కుట్టుతూకుట్టుతూవున్న బట్ట తీసి కోపంతో తపీమని, ఆ ముక్కల మీద వేసి కొట్టాడు. దెబ్బతో ఆ ముక్కలమీదవాలిన యీగలు ఎక్కడి వక్కడే చచ్చిపోయినాయి. ఏవో ఒకటో రెండో ఈగలు మాత్రం ఎలాగో తప్పించుకు ఎగిరిపోయినాయి.

వీరయ్యంటే ఏం సామాన్యుడా? మంచి శూరుడు, వీరాగ్రేసరుడు, అంతకు మించిన బుద్ధిబలం కలవాడుకూడాను.

అప్పుడు అతడు ఆ చచ్చిపోయిన ఈగలన్నింటినీ లెక్కిస్తే సరిగ్గా నూరున్నాయి. అంతట వీరయ్య సగర్వంగా ఇట్లా అనుకున్నాడు: "ఒక్క దెబ్బతో నూరు జీవరాసుల్ని సంహరించానే? నావంటి వీరుడు ఈ భూలోకంలో మరెక్కడయినా ఉంటాడా? నాబోటి వీరుడేమిటి, ఛా!– ఇటువంటి కుట్టుపని చెయ్యడ మేమిటి? నేను లోకాన్ని ఉద్ధరించి ఎన్నో ఘన కార్యాలు చేయాల్సి వుంది. నే నుండ వలసిన స్థానం ఇదికాదు!"

వీరయ్య ఎక్కడి బట్టలు అక్కడనే వదిలేశాడు. అందులో ఒక పొడుగాటి తెల్లటిబట్ట తీసుకుని, దానిపైన "నూరు జీవరాసుల్ని ఒకదెబ్బకు సంహరించిన వీర

కాశీచయనుల వెంకటశాస్త్రి, రాజమహేంద్రవరము

శిఖామణి వీరయ్య- నూటికి సర్దార్ " అని చక్కా రంగుదారంతో కుట్టాడు.

ఈ బిరుదులతో వున్న పటకా మెడలో ధరించి, వీరయ్య తిన్నగా బజారుకు వెళ్ళి, ఒక పిచికనూ, కొంచెం వెన్నముద్దనూ కొనుక్కుని, ఇహ దేశాటనకని బయల్దేరాడు.

సాయంకాల మయ్యేసరికి ఒక అడవి చేరుకున్నాడు వీరయ్య. చేరుకున్నాడేగాని, ఏ పులైనా, సింహమైనా కబళించివేస్తుందేమో నని అతని గుండె పీచు పీచు మంటూనే వుంది. అయినా సరే, మళ్లీ ఇంటిమొహం చూడకూడ దనుకున్నాడు.

ఆ రాత్రికి అక్కడనే ఒక చెట్టుకింద పండుకున్నాడు. తెల్లవారింది. వీరయ్య ఏ అపాయమూ లేకుండా క్షేమంగా లేచాడు. తన పిచికపిల్లనీ వెన్నముద్దనీ చేతపట్టుకుని కాళ్లకి బుద్ధిచెప్పాడు.

వెళ్ళగా వెళ్ళగా వీరయ్యకి ఒకపర్వతం అగపడింది. అందులో ఒక గుహ కూడా వుంది. ఆ కొండగుహలో ఎవళ్లూ వున్నట్టు అలికిడిలేదు. "సరి, బాగానేవుంది. ఇక్కడ కాస్సేపు అలసట తీర్చుకుందా"మని చెప్పి వీరయ్య చతికిలబడ్డాడు.

ఆ గుహ ఒకరాక్షసిది. ఆరాక్షసి ఇప్పుడు అహారానికని బయటికి పోయింది. ఈ సంగతి మన వీరయ్యకు ఏం తెలుసూ?




వీరయ్య అక్కడ కూర్చున్న కొంచెం సేపటికల్లా, ఆకాశం బద్దలవుతుందా అన్నట్టు పెళపెళధ్వనులు చేసుకుంటూ పెద్దపెద్ద అరుపులు వినబడ్డాయి వీరయ్యకి. గజగజ వణికిపోతూ ఏమిటా అని వీరయ్య బయటికి వచ్చి చూశాడు. ఇంకేముంది? బ్రహ్మరాక్షసి!! గబగబా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ "నరవాసన, నరవాసన! ఎక్కడా, ఎక్కడా!!" అని రంకెలు వేస్తూ మీదిమీదికి వచ్చేస్తూంది.

వీరయ్యకి ఏమీ తోచిందికాదు. తప్పించుకుపోవటానికా సావకాశం లేదు. ఇక ఎట్లాఅయినా యుక్తిచేసి బ్రహ్మరాక్షసిని

నాగినేని కృష్ణమూర్తి, చిన్నగంజాం



జయించడమే పని అని నిశ్చయించుకొన్నాడు వీరయ్య.

ఇంతలో బ్రహ్మరాకసి వచ్చి—" ఎవడవురా నువ్వు ? నా గుహలో ప్రవేశించడానికి ఎన్నిగుండెలురా నీకు ? చూసుకో ఇప్పుడు నిన్నేం చేస్తానో..." అని హుంకరించి, నోరు తెరిచింది.

వీరయ్య ధైర్యం నటించి, "ఓయీ, నేనెవరో నీకు తెలుసునా ? ఇదుగో ఇది చదువుకో ముందు" అని మెళ్లో కట్టుకున్న బిరుదుపట్టా రాకసికి చూపించాడు.

బ్రహ్మరాకసి చదువుకుని, పకపక నవ్వి, " ఓహో నువ్వా ? చూడబోతే నా చిటికిన వేలంత లేవు ! నువ్వేనా ఒక్కసారిగా నూరు జీవరాసుల్ని చంపింది ? మరయితే మనిద్దరమూ బలాబలాలు చూసుకుందాం, సిద్ధంగా ఉండు" అని గర్జించింది.

'సరే' నన్నాడు వీరశిఖామణి వీరయ్య.

వెంటనే బ్రహ్మరాకసి, చేరువనున్న రెండు బొమ్మరాళ్లు పట్టుకవచ్చి, " ఇదుగో నే నీ రాయి పైకి విసురుతాను. తరవాత నీవు విసురు. ఎవరు ఎక్కువదూరం విసరగలిగితే వాళ్లు గెలిచినట్టు. నువు గెలిస్తి వంటే నిన్ను వదిలిపెడ్తాను, ఓడినావంటే మింగేస్తాను, " అని చెప్పి వీరయ్య చేతికి ఒక రాయి ఇచ్చింది.

రాకసి విసిరిన రాయి రంయిమంటూ అంతరిక్షానికి వెళ్లిపోయి, మళ్లా ఒక అరగంట సేపటికి వచ్చి వాళ్ళముందు పడింది. ఇది చూచి వీరయ్యకు గుండె దడ పట్టుకుంది, ఇంతపని తను చేయగలనా, అని.

అయినా ధైర్యంనటిస్తూ, ఒక ఉపాయం ఆలోచించాడు: రాకసి చూడకుండా వీరయ్య, తన చేతిలోని రాయి పక్కనే పడేసి, జేబులో వున్న పిచికని తీసి గుప్పిట

పట్టి, "ఇదుగో చూడు"మని చెప్పి దాన్ని విసిరేశాడు. వీలు దొరికిందికదా, ఇదే సమయమనుకుని ఆ పిచిక రివ్వుమని ఎగిరి పోయింది. అంతే, మరి కంటపడలేదు.

అమాయికపు రాకసి ఇది కనిపెట్టలేక ఆ విసిరింది నిజంగా రాయే ననుకున్నది. అనుకుని, ఆ రాయి ఎప్పుడు కింద పడు తుందా అని గుడ్లు పెద్దవిచేసి ఆకాశము వంక చూస్తున్నది. వీరయ్యా కూడా రాయి కోసం ఎదురుచూస్తున్నట్టు నటించాడు. అది రాయిఅయితే కదూ తిరిగి రావటానికి? మధ్యాహ్నమయినా, రాయిజాడ కనబడ లేదు.

అంతట బ్రహ్మరాకసి— "నీ బలం పరీకించటానికి మరో పోటీ పెడ్తాను. అందులో నెగ్గాలి మరి" అని చెప్పింది వీరయ్యాతో.

ఇందుకూ అంగీకరించాడు యుక్తిపరు డయిన వీరయ్యా.

ఈ సారి మరిరెండు బొమ్మరాళ్లు తీసు కొచ్చింది బ్రహ్మరాకసి. వాటిల్లోనించి నీళ్లు పిండటం ఇప్పుడు పరీక.

రాకసి రాయితీసుకుని బలంకొద్దీ పిండే సరికి నాలుగైదు నీటిచుక్కలు కింద రాలినయి.




వీరయ్యాకు ఒక ఉపాయం మళ్లీ తట్టింది. రాయి పక్కనే పారేసి, జేబులోవున్న వెన్న ముద్ద తీసి గట్టిగా పిండేసరికి జల జల మంటూ నీటిధార ప్రవహించింది.

ఈ యుక్తి తెలుసుకోలేని బ్రహ్మరాకసి, వీరయ్యా కాళ్ళమీద పడి, తను ఓడిపోయి నట్టు వప్పుకుని, గుహ వదిలేసి పరు గుచ్చుకుంది.

కొంచెం తేరుకుని, మళ్లీ ప్రయాణం సాగించాడు వీరయ్యా. వెళ్లివెళ్లి ఒకపట్టణం చేరుకుని, ఒక అరుగు మీద పడుకున్నాడు: అలిసిపోయాడేమో, యిట్టే నిద్రపట్టేసింది.



ఆ పట్టణం పేరు కల్యాణనగరం, ఆ నగరాన్ని వీరసింహుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. మన వీరయ్య పడుకున్న అరుగు వున్నదే, ఆ ఊరి మంత్రిగారిదే. మంత్రి ఏదో పని మీద బయటకు వచ్చి, అరుగుపైన పడుకున్న వీరయ్యను చూచి అతని పటకామీద రాసివున్న బిరుదుల్ని చదువుకున్నాడు.

"ఇటువంటి వీరశిఖామణి మన రాజ్యంలో ఉండటం ఎంతయినా అవసరం" అని తలచి, మంత్రి వెంటనే వీరయ్యను లేపి, కోటలోకి తీసుకుపోయాడు. రాజుగారు కూడా ఇటువంటి వీరుడు లభించినందుకు చాలా సంతోషించారు. కోటలోనే వీరయ్యకి బస, సమస్తమైన సదుపాయాలూ ఏర్పాటుచేశారు.

ఒకనాడు రాజుగారు వీరయ్యకు కబురు చేసి, ఇట్లా చెప్పారు: "ఈ వూరి బయట ఇద్దరు రాక్షసులున్నారు. వాళ్లు పరమ దుర్మార్గులు. రాజ్యాన్ని అల్లకల్లోలం చేసి వేస్తున్నారు. వాళ్ళని హతమార్చి జయించుకు రావాలి. నీకు కావలసినంత సైన్యం తీసుకువెళ్లు. నూరు జీవాల్ని ఒక్క వేటుతో సంహరించిన వాడవు. ఇద్దర్ని చంపటం నీ కిదో లెక్కగనకనా!" అని చెప్పి హుషారీ చేశారు.

యుక్తిపరుడైన వీరయ్య ధైర్యంచేసి సరేనంటూ, ఇరవైమంది సైనికుల్ని వెంట బెట్టుకొని బయల్దేరాడు.

ఈ యిరవైమంది సైనికుల్నీ రాక్షసులుండేచోటికి యాభైగజాల దూరంలో నిలబెట్టి, తను ఈలకొట్టినవెంటనే రావలసిందని వాళ్లకి చెప్పి, కొన్ని గులకరాళ్ళు జేబులో వేసికొని, రాక్షసులుండే తావుకి ఒక్కడూ వెళ్లాడు.



ఒక చెట్టుకింద రాక్షసు లిద్దరూ గుర్రు పెట్టి నిద్దరబోతున్నారు. ఈ సమయంలో మన వీరయ్య, సడీచప్పుడూ చెయ్యకుండా చెట్టుపైకి ఎక్కి, దట్టంగా వున్న కొమ్మల మధ్య దాక్కున్నాడు. నెమ్మదిగా జేబులో నించి ఒక రాయితీసి చిన్నవాడి మీద, మరొక రాయి పెద్దవాడిమీద, ఇట్లా వేస్తూ వచ్చాడు. రాళ్ళు వెయ్యగా వెయ్యగా కొంత సేపటికి వాళ్ళు లేచి ఒకళ్ల నొకళ్ళు గుద్దుకున్నారు. తిరగబడ్డారు. ఇంకే ముంది?— ఇద్దరిమధ్యా పెద్ద యుద్ధం జరిగింది. ఇద్దరూ చచ్చి వూరుకున్నారు.

ఆ రాక్షసు లిద్దరూ పూర్తిగా చచ్చి పోయారని నమ్మకం కుదరగానే, వీరయ్య చెట్టుమీదినించి కిందికి దిగివచ్చి ఈల కొట్టాడు. ఇరవైమంది సైనికులూ బిల బిల మంటూ వచ్చి ఎదట నిలబడ్డారు.

ఈ వార్త ఊళ్ళో పాకి పోయింది. జనం అందరూ గుంపులుగుంపులుగా వచ్చి అక్కడ విరగబడ్డారు. వీరయ్యను పొగడని వాళ్ళు లేరన్నమాట. ఇంతలో రాజుగారు మంత్రితోసహా వచ్చి, వీరయ్యని అనేక విధాల గౌరవించి, తనరాజ్యంలో సగం రాజ్యం వీరయ్యకి ఇచ్చేశారు.




ఇలా వుంటూండగా— ఆ రాజ్యంలో ఒకఎలుగుబంటి ప్రవేశించింది. అది వూళ్లో పడి, అగపడినవాళ్లనందరినీ చంపెయ్యడం మొదలుపెట్టింది. దాన్ని పట్టడం ఎవళ్ళ తరమూ కాకుండా వుంది.

ఇది మరొకళ్ళవల్ల కాదని నిశ్చయించి, రాజుగారు వీరశిఖామణి వీరయ్యకు కబురు చేశారు:

"ఎలుగుబంటిని ఎట్లాగయినా సంహరించి పుణ్యం కట్టుకోవలసింది. ఈ పని నెరవేర్చినట్లయితే తక్కిన సగంరాజ్యం ఇచ్చి పట్టాభిషేకం చెయ్యటమే గాకుండా



మా అమ్మాయిని నీకిచ్చి వివాహంచేస్తాం" అని రాజుగారు వాగ్దానం చేశారు.

భేష్! బాగానే ఉన్నదనుకున్నాడు ఉపాయమెరిగిన వీరయ్య. ఊరి పొలి మేరని ఒక గది కట్టించాడు. ఈ మాటు కూడా ఒక ఇరవైమంది భటుల్ని వెంట బెట్టుకుని వెళ్ళి, ఒకచోటున నిలబెట్టి, ఈలవేసినప్పుడు రమ్మని చెప్పాడు.

తను ఒకకత్తి, పగ్గము చేతబట్టుకుని బయల్దేరాడు. కొంచెందూరం వెళ్లేసరికి పొద చాటునుంచి ఏదో వస్తున్నట్టు అలికిడి అయింది. పరకాయించి చూచాడు. ఇంకే ముంది? ఎలుగుబంటే!! అది వీరయ్యని చూడగానే ఎగేసుకు వస్తూంది. వీరయ్య పరుగుతీశాడు. అతని వెంట ఎలుగున్ను. వీరయ్య తిన్నగా వెళ్లి గదిలో దూరాడు. కిటికీపైకి ఎక్కేశాడు. ఎలుగుబంటి కూడా గదిలో చొరబడింది. మనిషి కనబడడేమా అని అటు యిటు తిరుగులాడుతూంది.

ఇంతలో వీరయ్య, పగ్గంతో ఉచ్చుపన్ని గురి చూచి ఎలుగుబంటి మెళ్లో పడేట్టు సూటిగా విసిరి తగిలించాడు. వీరయ్య లాగు తున్నకొద్దీ ఆ పగ్గం ఎలుగుబంటిమెడకి బిగుసుకు పోయింది. కొంతసేపటికి ఊపి రాడక, అది గిలగిల కొట్టుకుని చచ్చింది.

ఎలుగుబంటి పూర్తిగా చచ్చిందనేధైర్యం చిక్కిన తరువాత వీరయ్య కిటికీలో నుంచి కిందికి దుమికాడు. చేతనున్న కత్తితో దాన్ని పొడిచివేశాడు. ఈలకొట్టాడు. తక్షణమే సైన్యం వచ్చేసింది.

వీరయ్య ఊళ్లో ప్రవేశించగానే అతని వంటి వీరుడు నేటివరకు పుట్టనే లేదని అందరూ మెచ్చుకున్నారు.

రాజుగారు, మంత్రిగారు వీరయ్యకు ఎదురువచ్చి, అతణ్ణి పట్టపుటేనుగుమీద మహావైభవంగా ఊరంతా ఊరేగించారు. మర్నాడు రాజుగారు ఆకాశమంత పందిరి వేయించి, తన కుమార్తె నిచ్చి పెళ్లిచేసి, వీరయ్యకు రాజ్యం యూవత్తూ పట్టంకట్టారు.

ఇప్పుడు వీరయ్య రాజుగారి అల్లుడు. కళ్యాణపురానికి అధిపతి.

చూశారా పాపాయిలూ!—బట్టలుకుట్టు కునే వీరయ్య తెలివితేటలవల్ల ఎట్లా రాజయ్యాడో! అందుకనే శరీరబలంకంటె బుద్ధిబలం ఎక్కువదని చెప్తారు పెద్దలు. నిజమే అంటారా మరి?





# ధనవంతురాలు

ఆమె ధనవంతురాలు. కోరినంత ఐశ్వర్యం. బోలెడంత సంపద. కాని, ఒక్కటే లోటు—సంతానం లేకపోవటం.

ఆమెకు ఇంటినిండా దుస్తులే. అందుచేత కట్టినచీర కట్టకుండా కాలక్షేపం చేయగలదు. వంటినిండా నగలే. వాటిని అస్తమానూ మార్చి మార్చి, కొత్త అవతారాలతో ధరించగలదు.

ఈ వస్త్రాలూ, ఆభరణాలూ ధరిస్తుందే కాని, అంతమాత్రంచేత ఆమెకు ఆనందం లేదు. ఆకర్షణీయమైన బట్టలు కట్టుకుని, అందమైన ఆభరణాలు పెట్టుకుని, ఇంటింటికీ వెళ్లి ఇరుగు పొరుగువాళ్లకు చూపించాలి. వాళ్ళని ఊరించాలి. అప్పుడు అమ్మలక్కలందరూ ఆమెనిచూసి, ఆమె దుస్తుల ముస్తాబుచూచి, ఆమె ఆభరణాల అలంకరణ చూసి మురిసిపోవాలి.

"ఓహోహో, ఎంచక్కటి చీరమ్మా! ఎంత అందమైన జాకెట్టమ్మా!! మా జన్మలోనే చూచెరగం. అసలీ కుట్టే వేరు, ఈ రకమే వేరు, ఎక్కడ తయారయినయ్యో గాని......" అని ఈవిధంగా యావన్మందీ స్తోత్రాలు చేస్తూండాలి.

అప్పుడూ ఆమెకు ఆనందం. ఆ వూరి కల్లా తనే గొప్ప, తనే ఐశ్వర్యవంతురాలు, తనకంటె తక్కిన ఆడవాళ్లందరూ తక్కువ అనుకున్నప్పుడే ఆమె సంతోషం. ఇట్లా ప్రతిరోజూ ఆమె సంతోషిస్తూనేవుంటుంది. ఈ సంతోషంలో ఆమె ఇల్లూ, వాకిలీ, మగడూ— సంసారమూ— అన్నీ మరచిపోతుంది కూడా.

మామూలు అలవాటుచొప్పున ఒకనాడామె ఒక పేదరాలింటికి చూడబోయింది- కాదు, అన్నట్టు – పేదరాలికి తన వైభవం చూపెట్టబోయింది. పేదరాలు సంసారపు గొడవలో మునిగివుండటంచేత, ఆమెను అతిగా మర్యాదచేయటానికీ స్తోత్రం చేయటానికీ అట్టే తీరికలేకపోయింది.

"అవురా, నా అంతటిదాన్ని చూడవస్తే సరిగా మాటాడటానికయినా తీరికలేక

యం. కమలాదేవి, రాజమహేంద్రవరము.



పోయిందా? ఏం చూసుకున్నమిడిసిపాటు? నాకున్నకంటె ఎక్కువయిన బట్టలున్నాయనా, ఎన్నికయిన నగలున్నాయనా?— అయినా, పేదవాళ్లకు మర్యాద లేం తెలుస్తయి?'' అని అహంకారపడ్డది తనలో ఆమె.

అయినా, కదిపిచూతామని చెప్పి అడిగింది: "ఏమండీ అక్కగారూ! మీ నగలూ నాణాలూ ఎన్నడూ చూపించారు కారుగద! ఒక్కసారి చూడాలని నాకు ఎన్నాళ్ళనించో ముచ్చటగా వుంది'' అన్నది.

అనేసరికి పేదరాలు ఆమెతో: ''అదెంత మాట తల్లీ! నా నగలు ప్రొద్దునే బయటికి వెళ్లాయి. ఒక క్షణంలో తిరిగివస్తయి, రాగానే తప్పకుండా చూద్దురుగాని, అందాక అల్లా పీటమీద కూర్చోండి'' అని బదులు చెప్పి, మర్యాదచేసింది.

ఈ మాటలు విని, ఆమె ''ఓహో, ఈ పేదరాలి నగలు ప్రాణంగల నగలు కామోసు. అవి మనుషుల్లాగనే సంచరిస్తాయి కామోసు, ఏమీ ఈ పేదరాలి భాగ్యం!'' అని ఆశ్చర్యపడుతూ, ఆ వింతనగలు చూడటానికని కనిపెట్టుకూర్చున్నది.

కాస్సేపటికల్లా కళకళ్లాడుతూ, కిలకిల నవ్వుతూ, కేరింతాలు కొట్టుతూ బంగరు బొమ్మలవంటి బాలురిద్దరు పరుగెత్తుకొచ్చి, పేదరాలి ఒడిలో కూచున్నారు ముద్దుగా. "అమ్మా! అమ్మా! ఇవ్వాళ మా మేష్టారే, పరీక్షచేశారు, బహుమతు లిచ్చారు. ఇదుగో నాకుబంతి! అన్నయ్యకేమిచ్చారో అడుగూ మరీ...'' అన్నాడు చిన్నవాడు.



అమాంతంగా బిడ్డల్ని చేరదీసుకుని, పేదరాలు గుండెకు అదుముకుంది. ముద్దులు పెట్టుకుంది. చిడిముడిపలుకులు పలికే ఆ చిన్నారి పాపల్ని చెరో చంకలో ఇముడ్చుకుని, ఆమెతో చెప్పింది. "అమ్మా! ఇవిగో నానగలు, ఇప్పుడే ఇంటికి వచ్చాయి. ఇవ్వే నాకున్న సర్వాభరణాలూ సమస్తమైన భూషణాలున్నూ."

ఈ దృశ్యం చూడగానే ఆమెకు ఒళ్ళు గగుర్పొడిచింది. పేదరాలి మాటలు విని, తప్పుచేసినదానిలాగ ఆమె తల వంచుకుంది.

ఇక ఉండబట్టలేక, పేదరాలితో ఆమె ఇట్లా వలపోసింది: "అక్కగారూ! నా మనసులో మాట దాపరికం లేకుండా చెప్పేస్తున్నా, మన్నించండి: అందరూ మిమ్మల్ని అదృష్టవంతురాలనీ, భాగ్యవంతురాలనీ చెప్పుకుంటున్నారు. ఆ మాట విని అదేపాటి భాగ్యమో చూచిపోదామని వచ్చాను. అక్కగారూ! నిజమైన భాగ్యం ఎటువంటిదో ఈనాటికి మీ ధర్మమా అని తెలుసుకో గలిగాను. నాకు కమ్మిన



మాయపొర ఇప్పుడు తొలగిపోయింది. దయుఉంచండి, వెళ్లి వస్తా" నని చెప్పి ఇంటికి మళ్లింది.

ఇప్పుడామె పూర్తిగా మారిపోయింది. శ్రద్ధతో సంసారం చక్కబెట్టుకుంటున్నది. పతిని భక్తితో సేవిస్తున్నది. మంచి పేరు గడించింది. రేపో మాపో మాణిక్యంవంటి కొడుకునికూడా కనబోతున్నదని చెప్పుకుంటున్నారు. ఏమదృష్టం! ఆమె మునుపు ధనవంతురాలు! ఇప్పుడు భాగ్యవంతురాలు!! నిజమేనంటారా?






ఒకవూళ్లో ఇద్దరు తోడికోడళ్లు ఉండే వారు. అందానికి ఒకరిని మించిన వాళ్లు ఒకళ్లు. పెద్దామెకు బారెడేసి పళ్లు. చిన్నా మెకు మూరెడేసి పళ్లు. ఆపు లేకుండా పెరిగిన ఆపండ్లను రక్షించటానికి చేతగాక, వాళ్ళ పెదిమలు వెనక్కి జంకి ఊరు కున్నాయి. వూళ్లోవాళ్ళంతా ఆ అక్కా చెల్లె ళ్ళను, బారెడుపళ్ళ అక్కమ్మా, మూరెడు పళ్ళ చెల్లెమ్మా అని పిలిచేవారు.

ఒకనాడు పక్కవూళ్లో తీర్థం జరుగు తోంది. ఆ వూళ్లో అమ్మలక్కలంతా ముస్తాబై, గుంపులు గుంపులుగా తీర్థం చూడ్డానికి బయలుదేరారు.

మన బారెడుపళ్లక్కమ్మా, మూరెడు పళ్ళచెల్లెమ్మా కూడా బయలుదేరారు. నున్నగా దువ్విన కొప్పుమీద బంతిపూలు ముడుచుకుని, మెడనిండా గంధం రాసు కుని, నోట్లో కిల్లీ బిగించి చరచరా చేతు లాడించుకుంటూ నడకసాగించారు. తీర్థపు ఖర్చుకోసం రూపాయి డబ్బులు చెంగుని ముడివేసుకున్నారు. తోవలో ఏవేవో ఊసులాడుకుంటూ ఒక్క క్షణంసేపట్లో తీర్థం చేరుకున్నారు.

తీర్థంలో ఎక్కడచూసినా రంగుల రాట్నాలే, ఎక్కడచూసినా సిలవరిగిన్నెల దుకాణాలే, ఎక్కడచూసినా కమ్మగా వేయించిన వేరుసెనగకాయల కుప్పలే, ఎక్కడచూసినా నించోబెట్టిన చెరుకుగడ కట్టలే,—ఈ విధంగా తీర్థం చూడటానికి రెండుకళ్లూ చాలకుండా ఉన్నాయి.

తీర్థానికి వెళ్లినవాళ్లు ఎవరికితోచిన వస్తువులు వాళ్లు కొనుక్కుని యిండ్లకు వెళ్ళ

గూడూరి విజయకుమార్, కటకం.





తున్నారు. రోడ్లమీద ఎక్కడచూచినా చెరుకు పిప్పులే, ఎవరిచేతిలో చూచినా కొత్త సిలవరి గిన్నెలే. ఇటువంటి గొప్పతీర్థం ఇంకెక్కడా జరగలేదన్నట్లు పరమానందంతో రోడ్లమీద జనం గుంపులు గుంపులుగా తిరిగి ఇండ్లకు వస్తున్నారు.

ఇహ,— మన బారెడుపళ్ళక్కమ్మా, మూరెడుపళ్ళచెల్లెమ్మా తీర్థం వెళ్లీ వెళ్ళడంతోనే రంగులరాట్నం చూశారు. దాంతో వళ్లు పరవశం అయిపోయింది. ఇక ఉండబట్టలేక చెరిఒక అణా యిచ్చి ఆ రంగుల రాట్నం గుర్రాలు యెక్కి గట్టిగా పట్టుకూర్చున్నారు. మూడుమాట్లు గిర్రు, గిర్రు మని తిరిగి, దిగిపోయారు.

తరవాత తీర్థంఅంతా కలియతిరిగారు. చివరికి సిలవరిగిన్నెల దుకాణందగ్గిరకి వచ్చి పదిఅణాలు ఇచ్చి ఒక సిలవరిగిన్నె కొన్నారు. పక్కనేఉన్న దుకాణంలో సెనగపప్పు చూశారు. వెంటనే మిగిలిన పావలా యిచ్చి పావుశేరు శనగపప్పు కొని, ఆ కొత్తగిన్నెలో పోయించుకున్నారు.

అక్కడితో తీర్థంచూడ్డంపూర్తిఅయింది. ఇంటిదారి పట్టారు. తోవలోనే ఆ సెనగపప్పుఅంతా ఇద్దరూ కలిసి తినేశారు. కాని పాపం వాళ్ళ కడుపులోకి పోయింది ఓ గిద్దెడు పప్పు వుంటుందేమో. మిగతా పప్పంతా వాళ్ళ పళ్లకే అంటుకుపోయింది!

ఇలాగ సగందూరం నడిచేటప్పటికి చీకటిపడింది. ఆ చీకట్లో యింటికి పోలేక వాళ్లు దార్లోఉన్న పెద్ద మర్రిచెట్టు యెక్కి ఆ చెట్టుతొర్రకి కాళ్లు తన్నిపెట్టి, రవంత కన్నుమూశారు. అంతట్లో ఎక్కణ్ణించో ఒక



అక్క కికలిగిన అదృష్టం చూచి మూరెడి పళ్ళ చెల్లెమ్మ ఓర్వలేక పోయింది. మరునాడు ఒక పావుశేరు సెనగపప్పు కొని, కసా పిసా నమిలి పళ్ళనిండా అంగుళం దళసరిని ఆ ముద్ద అంటించుకుంది. అక్క ఎక్కిన ఆ మర్రిచెట్టే యెక్కి ఆ రాత్రి చెట్టుమీద పండుకుంది.

తొలినాటిరాత్రి సెనగపప్పు రుచిమరిగిన గబ్బిలం మళ్లా వచ్చింది. తను క్రిందటి రాత్రి తీసుకెళ్లిన బారెడుపళ్లున్ను ఈమెకు పెట్టేసి, ఆవిడ మూరెడుపళ్లనూ తను అతికించుకుని రివ్వున ఎగిరిపోయింది. తెల్లవారి చూసేసరికి మూరెడుపళ్ళ చెల్లెమ్మపళ్లు రెట్టింపుగా పెరిగి ఉన్నాయి. పాపం! ఆమె దుఃఖానికి మితిలేదు.

ఇప్పుడు వూళ్లోవాళ్లంతా బారెడుపళ్ళక్కమ్మని ఎలకపళ్ళచెల్లెమ్మ అనీ, మూరెడు పళ్లచెల్లెమ్మని బారెడు పళ్ళక్కమ్మ అనీ పేర్లుమార్చి పిలవడం ప్రారంభించారు.

ఇంతకూ ఎవరి అదృష్టం వాళ్ళది. ఏమంటారు?

గబ్బిలంవచ్చి ఆ చెట్టుమీద వాలింది. సెనగపప్పు వాసన పసికట్టి, బారెడుపళ్లక్కమ్మా, మూరెడుపళ్ళ చెల్లెమ్మా పడుకున్నచోటికి వచ్చింది. అతి చాకచక్యంగా అది బారెడిపళ్లక్కమ్మ పండ్లను ఊడదీసి తను పెట్టుకుని, తన చిన్నపండ్లను బారెడుపళ్ళక్కమ్మకి పెట్టేసి, ఏమీ యెరగనట్టు ఎగిరిపోయింది. తెల్లవారి చూసేసరికి బారెడు పళ్లక్కమ్మల్లా ఎలకపళ్ళక్కమ్మగా మారింది. ఆమె ఆనందానికి మేరలేకుండా పోయింది.



# "లాగూ" దెయ్యం

అనగనగా ఒక ఊరు. అవూళ్లో ఒక తల్లీ కొడుకూ ఉన్నారు. తండ్రి చనిపోయి నాలుగు సంవత్సరాలైంది. మంచి గౌరవంగా పెరిగిన కారణంచేత, కొంచెము దూరపు ఊరైనా స్థితిమంతుల బిడ్డనే కొడుక్కి వివాహం చేసింది.

అతనిపేరు పరాంకుశం. ఐనా అతనిని స్నేహితులందరు 'తాతయ్యా' అని పిలుస్తారు. ఇక మన తాతయ్య చిన్నవాడు గాబట్టి స్నేహితులతోనే తిరగటం, వారితోనే భోజనం చెయ్యటం, వారితోనే కలిసి నిద్రపోవటం ఇట్లా చేస్తూఉండేవాడు.

సంవత్సరమైంది పెళ్ళై. మామగారు అల్లుడిని పండుగకు తీసుకెళ్ళుదామని వచ్చారు. కాని స్నేహితులను వదిలి వెళ్లటం మన తాతయ్య కిష్టంలేదు. ఇక మామగారి బలవంతంచేత వెళ్ళక తప్పిందిగాదు. తనతో స్నేహితులుగూడ వస్తేనేగాని రానన్నాడు. అందుకని వారిని కూడా మామగారు తీసుకొని బయలుదేరారు.

సరే యింకేం, అల్లుడు వచ్చాడుగదా అని మామగారింట్లో పంచభక్ష్య పరమాన్నములు, నవకాయ పిండివంటలతో ఆరోజు మధ్యాన్నం భోజనం జరిగింది. మధ్యాన్నం భోజనాలు ఆలస్యమవటంచేత మాకు ఆకలవటంలేదని స్నేహితులు రాత్రి భోజనం మానివేశారు. కాని మన తాతయ్య సిగ్గుచేత మధ్యాన్న భోజనమే సరిగా చెయ్యలేదు. ఆకలేస్తోంది. ఐనా స్నేహితులు భోజనం చెయ్యము అన్నారు కాబట్టి తనూ చెయ్యననేశాడు.

అల్లుడికి కోపంవచ్చిందేమోనని మామగారు, బావమరదులు, మరదళ్లు అంతా వచ్చి బ్రతిమాలేరు. ససేమిరా వద్దంటె వద్దన్నాడు. స్నేహితులచేత చెప్పించారు. అప్పటికీ వద్దన్నాడు. అల్లుడికి కోపం వచ్చిందని, కారణం తెలియక ఇంటిల్లిపాదీ దిగులుపడ్డారు. అసలుగొడవ వాళ్లకేం తెలుసు, పాపం.

రాత్రి, స్నేహితులతోపాటు అల్లుడికి మేడమీద పక్క వేశారు. గాలి బాగా

వెల్లంకి వెంకటసుందరరావు, ఏలూరు.



వేస్తుందని పడుకున్నాడు మనవాడు. నిద్దర పట్టితేగా? ఒకమూల కడుపు కాలుతోంది. ఏంచేస్తాడు? ఒక రాత్రివేళ స్నేహితులను లేపేడు. "అరే ఈవాళ మీరు కడుపునిండా భోజనం చేశారాయెను. నాసంగతి మీకు తెలుసుగదా. ఆకలి మండిపోతోందిరా. నిద్దర పట్టటంలేదు ఏంచెయ్యను" అన్నాడు. పాపం వాళ్లకి ఏమీతోచలేదు. అటూఇటూ చూస్తే ఆ వంటయిల్లు మండువా యిల్లు. అందువల్ల మండువా గొట్టంద్వారా వంట యింట్లోకి దూరి దిగచ్చు, గాని రావటం?

చివరకి ఆలోచించి మనవాడి స్నేహితులు వాళ్ల కండువాలన్నీ ఒకదానికొకటి ముడేసి తాతయ్యా నడుముకి కట్టారు. "ఒరే నిన్ను ఈవిధంగా మండువా గొట్టంద్వారా వంటింట్లోకి దింపుతాం. బాగా నీకు కావలసిన పన్నీ వడ్డించుకుతిను. తినటమవగానే 'లాగు' అని అను. మళ్ళీ నిన్ను పైకి లాగేస్తాం" అన్నారు. తరువాత తాతయ్యను వంటింట్లోకి దింపారు.

ఆకలి బాగావేస్తోందేమో తనకు కావలసినవన్నీ వడ్డించుకు తిని ఒక గంట సేపటికి ఎల్లాగైతేనేమి 'లాగూ' అని పిలిచాడు తాతయ్యా. లాగే దెవరు! ఎంత సేపటికీ తాతయ్యా పిలవకపోయేవరకు అతని స్నేహితులు నిద్రమత్తున గుడ్డ వదిలివేసి అంతాగుర్రుపెట్టి నిద్రపోయారు. ఎవ్వరికీ వినిపించలేదా కేక. అక్కడ నుంచి లంకించుకొన్నాడు మనవాడు ఎప్పటికైనా వినిపించకపోతుందా అని, "లాగూ! లాగూ!! లాగూ!!!" అని కేకలు వెయ్యసాగాడు.

కొంతసేపటికి అత్తగారు క్రింద పడుకోని ఉండటంవల్ల ఆమెకు ముందు వినిపించి లేచింది. "ఏమిట్రా నేను వంటిల్లు తాళము

వేశానే. అక్కణ్ణుంచి 'లాగూ' అని అంటోందేమిటీ" అని కంగారుపడి భర్తనులేపి "ఏమండోయి మన వంటిల్లు రాత్రి తాళము వేశాను. కాని అందులో నుంచి ఇప్పుడు ఏదో "లాగూ, లాగూ" అని అంటోంది. నాకు చాలా భయం వేస్తోంది. ఏదో దెయ్యంలాగా ఉంది" అని బిక్క మొహం వేసింది. ఇకనేం, ఇంటా యన భూతవైద్యుడికోసం పరుగెత్తాడు.

ప్రక్క సందులోనే ఆయిల్లు. కంగారు పడుతూ వచ్చిన సుబ్బయ్యగార్ని చూచి "ఏమిటండీ యింత రాత్రివేళ ఇల్లా హడా విడిగావచ్చారేం?" అన్నాడు భూతవైద్యుడు. "ఇం కేముందండీ మా వంటింట్లో 'లాగూ' దెయ్యం దూరింది. మాకు భయంవేస్తోంది. పిల్లలుగలవాడ్ని. రక్షించాలి" అన్నాడు మన తాతయ్య మామగారు.

"ఒక్క నిముషంలో చావబాది పార తోలుతా" నని మీసాలు దువ్వి బయలు దేరాడు కావలసిన సామగ్రిఅంతా పట్టు కొని భూతవైద్యుడు.

ఇంటిల్లిపాదీ లేచి కంగారుపడు తున్నారు, ఏంజరుగుతుందో అని. వంటింటి గుమ్మందగ్గిర ఏవో ముగ్గులువేసి నిమ్మ కాయలు కొరుకుతూ "హ్రాం, హ్రీం" అంటూ బలే ఆర్భాటంగా మంత్రాలు



చదివేస్తున్నాడా దెయ్యాల పేరయ్య. కొంతసేపటికి అన్నాడుగదా "నేను తలుపు తీసి లోపలికెళ్లి ఆ దెయ్యాన్ని బయటకు తోలుతాను. అది తెల్లతెల్లగా ఉంటుంది. మీరందరూ పేము బెత్తాలతో దానిని బాగా చావబాదండి. అది మళ్లా మీయింటి జోలికి రాదు. కాని ఒక విషయం: అది చాలా దొంగఎత్తులు వేస్తుంది. అది 'నేను కాదు, నేను కాదు' అంటుంది. అన్న ప్పటికీ 'నేనూలేదూ, నువ్వూలేదు' అంటూ బాదండి. లేకపోతే అందరిమీద విరుచుకు పడుతుంది. తరువాత ఏమనుకున్నా లాభం

లేదు" అనిచెప్పి, తలుపుతీసి లోనికెళ్ళాడు. అంతా బెత్తాలతో సిద్ధంగా ఉన్నారు.

ఈ మాటలన్నీ లోపలనుంచి వింటూన్న తాతయ్య రెండు పెరుగు కడవలూ, రెండు పాలకుండలూ చేతపుచ్చుకుని జాగ్రత్త పడ్డాడు. పేరయ్యగారు లోపలికి పోయీ పోవటంతోనే ఆ కుండలు ఆయన నెత్తిన పగలేశాడు. "చచ్చానురా బాబో" అంటూ బయటకు దూకేడు దెయ్యాల పేరయ్య. కాని పాలూ పెరుగూ ఒంటినిండా పడటంవల్ల తెల్లతెల్లగా కనిపించాడు.

ఇక నేం? బాదటం మొదలెట్టారు బెత్తాలతో బయటనున్నవాళ్లు. చీకట్లో బాగా కనుపించటంలా. "బాబో నేను కాదు; నేను వైద్యుడిని, పేరయ్యనే" అని అరిచినా మరి లాభం లేకపోయింది. వళ్ళు పగిలేటట్టు కొట్టుతున్నారు వాళ్ళు. ఇక యిది పనికాదని పరుగెత్తిపోయాడు. దెయ్యంపీడ వదిలిందనే సంతోషంతో వైద్యునిమాటే మరచి అందరూ హాయిగా పడుకున్నారు. తాతయ్య కూడా ఈ హడావుడిలో మేడమీదకుపోయి పక్కమీద గప్‌చిప్‌గా పడుకున్నాడు.

మరునాటి ఉదయాన వీధిఅరుగుమీద నున్నపుపట్లు వేసుకుని కూర్చున్న పేరయ్యగార్ని చూచి సుబ్బయ్యగా రన్నారుగదా "ఏమండీ! రాత్రి దయ్యాన్ని వెళ్ళగొట్టినపుడు బాగానే ఉన్నారుగదా, ఇదంతా ఏమిటి?" అని. "ఆ దయ్యం నాకు బాగా శాస్తిచేసిందండీ. రాత్రి దయ్యానికిబదులు మీరంతా నన్ను చావగొట్టారు." అని జరిగిన కథంతా చెప్పేడు దెయ్యాలపేరయ్య.

సుబ్బయ్యగారు చాలా విచారించి యింటి కొచ్చారు. తాతయ్య ఏమీ ఎరగనట్లుగా "ఏమండీ మామగారూ, రాత్రి మనింట్లో ఏదో గొడవైందిటగా?" అన్నాడు.

"చాల్లే నాయనా, దానిని పారదోలటానికి వచ్చిన ఆ దయ్యాలపేరయ్యగార్నే వళ్ళు చితక గొట్టించింది. నయం, నువ్వు అదృష్టవంతుడివి" అన్నది అత్తగారు.

మూడోనాడు స్నేహితులంతా నవ్వుకుంటూ వాళ్ళ ఊరొచ్చారు. అప్పటి నుంచి తాతయ్యను 'లాగూ దెయ్యం' అని అంటే "చాల్లేరా" అనేవాడు పరాంకుశం.





















## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పైన ఆరుపడవలు వున్నయ్యి కదూ? ఆ ఆరూ ఒకేలా కనిపిస్తూవున్నా, నిజానికి అలాలేవు. రెండు పడవలు కొంచెం తేడాగా వున్నయ్. ఆ తేడా లేకపోతే ఆరు పడవలూ ఒకటే. మరి తేడాగా వున్న ఆ జంట పడవలు ఏవో కనుక్కోండి.

మీరు కనుక్కోలేకపోతే జవాబుకు 53 పేజీ చూడండి.

# వీరబల్ వినోదాలు



పాపాయిలూ !

వీరబలుడి పేరు విన్నారో లేదో, ఆయన మన తెనుగువాడు. బలే తెలివయినవాడు. ఆయన ఒక్క పలుకు పలికితే, తెగ నవ్వు వచ్చేస్తుంది. అందుకనే, మన వీర బలుణ్ణి అక్బరుపాదుషా తన ఆస్థానంలో ముఖ్య మంత్రిగా అట్టే పెట్టుకున్నాడు.

అక్బరు అడిగే ప్రశ్నకు సమాధానం చెప్పగలవాడు ఒక్క వీరబలుడేనన్నమాట.

వీరబలుడంటే పాదుషా మక్కువ పడతాడని చెప్పి, తక్కిన మంత్రు లందరకూ అసూయ. అంచేత, అవకాశం చిక్కినప్పుడల్లా వాళ్లు వీరబలుడ్ని గురించి ఏవేవో కిట్టనిమాటలు చెబుతూ, అతని పైన ప్రభువుకి ద్వేషం కలిగించేందుకు ప్రయత్నించేవాళ్లు.

అబ్బే! ఇట్లాటివాళ్లని లక్షమందిని చూచివుంటాడు వీరబలుడు. వీళ్లొక లెక్కా? — అయితే, వీరబలుడుకూడా ఏలయినప్పుడల్లా వాళ్ళని దెబ్బతీసి యేడిపించటానికే చూస్తుంటాడు.

వీరబలుడ్ని కొంటెప్రశ్నలు వేసి ఎట్లా అయినా చిత్తుచేయడమంటే పాదుషాకు సరదా.

ఒకనాడు, నిండు దర్బారులో అక్బరు పాదుషా, ఆయన ప్రక్కనే మన వీర బలుడూ, తరువాత తక్కిన మంత్రులు యావన్మందీ కూర్చునివున్నారు.

వీరబలుణ్ణి పాదుషా ఇట్లా ప్రశ్నించాడు: "చూడు, వీరబల్! నా అరచేతిపైన వెంట్రుకలు లేవుకద, ఎంచేతనోయి ?"

వెంటనేచెప్పాడు వీరబలుడు : "ప్రభూ! దీనికి కారణం ప్రత్యక్షంగా అగుపడుతూనే వుండగదండీ. పేదసాదలకు దానధర్మాలు చేయటంలోనూ, విద్వాంసుల్ని సత్కరించటంలోనూ దేవరవారి అరచేతులు అరిగిపోయినవండి. అంచేత, అక్కడ వెంటుకలు తలసూపటానికే వీల్లేక పోయింది."

ఇది వూరికే స్తుతిపాఠంకోసం చెప్పిన మాటలని అనిపించింది పాదుషాకు.

'దా మూ'



ఏమంత సంతృప్తి కాలేదు. ఈసారయినా వీరబలుడ్ని పట్టీ కొట్టించాలని నిశ్చయించాడు.

"మరైతే, వీరబల్! నీ అరచేతులపైన ఎందుకు మొలవలేదు, చెప్పు" అన్నాడు అక్బరు.

తడుముకోకుండా చెప్పాడు వీరబలుడు: "ఇది ఒక ప్రశ్నా ప్రభూ!— ఏలినవారు అనుగ్రహించే బహుమతులు అందుకుంటూ వుండటంచేత, నా అరచేతులపైన వెంట్రుకలు మొలవకుండా పోయినయి."

అనేసరికి, అక్బరు ఒక్క నిమిషం సేపు అట్టె ఆలోచనలో పడ్డాడు. అరె, ఈ వీరబలుడు రెండు ప్రశ్నలకూ దొరక్కుండా తప్పించుకుపోయినాడే అని అనుకుని, మళ్ళీ ఇట్లా అన్నాడు:

"వీరబల్! నేను వేసిన రెండు ప్రశ్నలకూ చక్కటి సమాధానాలు చెప్పావు. బాగుంది. అయితే ఇంకొక్క సంశయం ఉండిపోయింది నాకు. అదికూడా తీర్చాలి. బహుమతులు ఇవ్వటంవల్ల నాకూ, అవి అందుకోవడంవల్ల నీకూ అరచేతిలో వెంట్రుకలు మొలవలేదన్నావు. మరి, తక్కిన ఆ మంత్రులందరకూ మొలవలేదు కదా, ఇందుకేం చెబుతావ్?"

ఈ ప్రశ్నకు తక్షణమే అందుకున్నాడు వీరబలుడు: "దేవరా! ఇదేదో గొప్ప సంశయమనుకున్నాను. దీనికి కారణం ఎక్కడో వెతికేదేమిటి ప్రభూ!—ఏలిక స్వహస్తాలతో బహుమతులు ప్రసాదించటం, వాటిని నేనూ, తక్కినవాళ్లూ అందుకోవటం— ఇది చూడలేక అసూయపడే మంత్రులు 'మాగతి ఇంతేకద దేముడా' అనుకుని రెండు చేతులూ నులుముకుంటూ వుండటంచేత వాళ్ళ అరచేతులపైన వెంట్రుకలు మొలవకుండా పోయినాయి, ప్రభూ! ఇంతకంటే ఏం చెప్పమంటారు?"

ఈ జవాబుకి పాదుషా చాలా మెచ్చుకున్నాడు. తక్కినమంత్రులు యావన్మందీ సిగ్గుపడి తలలు వంచుకున్నారు.



# చందమామ

★

చందమామ, చందమామ
ఆడుచు పాడుచు చుక్కల్లోనా
అల్లిబిల్లిగ తిరిగేవా!
అబ్బా యిడుగో చూచావా!!

* * *

చుక్కల్లారా! చుక్కల్లారా!
తక్కుతు తారుతు నున్నారా
తళుకులు బెళుకులు చూపండీ
సిరులొలికించే చిట్టీ మోము
తరతరాల కొక వెలుగేమో!!

* * *

మబ్బుల్లారా! మబ్బుల్లారా!!
మాయూరికి దయచేస్తారా
మెల్లగ చల్లగ నడిచేరా
జిల్లని వానలు కురిసేరా
భారతభూములు పండేను
పాపల బొజ్జలు నిండేను.

రచన : వీరేశ్వరాచార్యులు

# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము :

1. అలంకారము
3. మన వెనుక ప్రక్క
5. దూరము (తల క్రిందులు)
7. విసరివేయు
8. శ్రీకృష్ణుని అన్న
11. గడుసువారు
14. మార్గము
15. దీనిని నాలుకతో చూడగలము.
17. పెజి
18. పాత్ర.




### నిలువు :

1. హాసము
2. ఒక కొండజాతి మనిషి.
3. బలశాలి
4. పుష్పము
6. గుడారము
9. కుశలవులలో ఒకరు
10. లేతకానిది
11. వంట పనిముట్టు
12. సమావేశము
13. తలక్రిందయిన గిరులు
14. దగ్గర
16. చిహ్నము.




పొరుగ పిలలతోను పోట్లాడబోకు
ఇరుగుపిల్లలతోను ఏట్లాడబోక,
చక్కగా నీచదువు, చదువుకో తండ్రి
చదువుకుంటే నీకు సౌఖ్యమబ్బేను.

★

చిచ్చెమ్మ చినగాలి పెట్టు పెదగాలి
అయ్యోధ్య వీధుల్లో అణిగెనే గాలి
చలికి వెరచినట్లు పులికి నే వెరవ
ఆకలికి వెరతును, అమ్మకీ వెరవ.

★

సింహాద్రి అప్పన్న గుళ్ల ముందార
పడ్డారె గొడ్రాళ్లు ప్రాణాచారమ్ము
ఎందుకూ పడ్డారు? ఏల పడ్డారు?
సంతాన మిమ్మని చాలపడ్డారు.
సింహాద్రి అప్పన్న కేమి లంచమ్ము?
గుడి దిరుగు వస్త్రమ్ము గుమ్మడీపండు.
దాగళ్ళ వడపప్పు బెండుబెల్లాలు.

ఉన్నవూరు విడచి వుండనేలేము
కన్నతల్లిని విడిచి ఘడియుండలేము
వున్నవూరే నాకు చెన్నపట్నమ్ము
కన్నతల్లే నాకు కల్పవృక్షమ్ము.

★

మద్దికాయలు ముద్దు మాటల్లు ముద్దు
మాటల్లు ఆడంగ మామలకు ముద్దు
అమ్మాయి ఆటల్లు తండ్రులకు ముద్దు
అందరికి అమ్మాయి అల్లారుముద్దు.

★

చిలకలు చెలరేగి జీడికొమ్మెక్క
అమ్మాయి చెలరేగి మామభుజమెక్క
మామభుజమెక్కి తానేమేమి అడుగు?
పాలుత్రాగు గిన్నడగు పాడియావడుగు.

★

కానివారి మాట కంట్లోది నలుసు
ప్రాణం పోయిందాక ప్రక్కలో పోటు
అయినవారి మాట అమృతంపుతేట
బ్రతికి ఉన్నాదాక భాగ్యంపుమూట.

సంపాదన : దీవి భానుమతీదేవి

# తెలివిగల కుక్క!



## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పై చదరం మధ్యనివున్న పిల్లిని ఏదారిన పోయి పట్టాలో చదరం నాలుగుమూలలా వున్న కుక్కల్లో ఒక కుక్కకు మాత్రమే తెలుసును. మిగతా మూడు కుక్కలూ వట్టి దద్దమ్మలే. మరి, ఆ తెలివిగల కుక్క ఏదో మీరు కనుక్కోండి చూదాం.

---

49 పేజీలోని పడవలబొమ్మలకి జవాబు:

**1, 5** నెంబర్లుగల పడవలు రెండూ తేడాగా వున్నవి.



ఆల్ ఇండియా రేడియో, మద్రాసువారు అక్టోబరు రెండవతేదీన గాంధిజయంతి ఉత్సవాలు జరిపారు. ఆనాటి తెలుగు కార్యక్రమంలో పాల్గొన్న కొందరు పిల్లలూ పెద్దలూ పై ఫోటోలో వున్నారు.

## ముగ్గు



బి. సరోజిని, కాకినాడ

## పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 న | 2 గ | | | | 3 పీ | 4 పు |
| 5 ష్య | ద | | 6 డే | | 7 రు | ష్య |
| | 8 బ | 9 ల | రా | 10 ము | డు | |
| | | వు | | దు | | |
| | 11 గ | డు | 12 స | రు | 13 లు | |
| 14 దా | రి | | భ | | 15 రు | 16 చి |
| 17 పు | ట | | | | 18 గి | న్నె |

## 3 కోట్ల ఆంధ్రులకు 3 ఉత్తమ పత్రికలు

నేడే చందాదారులుకండి!

# చందమామ

పిల్లలకు

సాలుచందా 5-0-0
రెండేండ్లకు 9-0-0

# యువ

యువ విద్యార్థులకు

సాలుచందా 3-0-0
రెండేండ్లకు 5-0-0

# ఆంధ్రజ్యోతి

పెద్దలకు

సాలుచందా 5-8-0
రెండేండ్లకు 10-0-0

ఆఫీసు

**పోస్టు బాక్సు నెం. 1686 :: మద్రాసు-1**

Printed and Published by B.N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K. RAJA RAO.




Chandamama, November, '48 Drawn by: 'Chitra'

మన అందరిదీ ఈ పండుగ!

# తండ్రీకొడుకులు



తండ్రికి చిన్నవాణ్ణికావాలని ఇష్టం; కొడుకుకు పెద్దవాణ్ణికావాలని కోరిక. వీరి కోరికలు నెరవేరితే ఎన్ని ఇబ్బందులు కలుగుతాయో ఈ పుస్తకంలో చదవండి.

వెల **0-8-0** మాత్రం. వివరాలకు వేరేప్రకటన చూడండి.

THE B. N. K. PRESS, MADRAS - 1